*Issued on 9 - 2—1957*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

# DEBATES

## OFFICIAL REPORT

*WEDNESDAY, the 28th MARCH, 1956.*

VOLUME VI — No. 4.

CONTENTS


| | | Pages |
|---|---|---|
| I. | Questions and Answers ... ... | 327 — 353 |
| II. | Half hour debate—re:—lapse of loans and subsidies received from the Central Government ... ... | 353 |
| III. | Government Motion re :—Motion under Rule 129 (4) of the Assembly Rules ... | 354 |
| IV. | Budget for the year 1956-57. Voting of Demands for Grants (contd.) (1) Demand No. XX—Co-operation. | 354 — 405 |
| | (2) Demand No. XVIII—Agriculture and Fisheries. (3) Demand No. XIX—Veterinary. (4) Demand No. IV—Forests. | 406 — 442 |
| | Appendices ... ... | 443 — 497 |


PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1957

*Price 6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBL

*Wednesday, the 28th March* 1956.

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTION AND ANSWERS.

### SHORT NOTICE STARRED QUESTIONS.

*Delimitation of Constituencies in the State.*

659-C.—

S. N. Q. No 1308-D. Q —SRI P. PARTHASARATHI :— Will the Hon. the Chief Minister be pleased to state :

(a) the circumstances under which the Delimitation Commission which recently met, recommended for less number of reserved seats for Andhra ,

(b) if so, the number of members belonging to Reserved Classes to be reduced from the total allotted to Andhra ;

(c) if so, the Constituencies affected ; and

(d) if the reduction of the number of Reserved Seats is a certainty, will the Government take up the question with the Election Commission or Commissioner and see that the number of seats reserved may be least affected ?

THE HON. DR. B. GOPALA REDDI ;—

(a) By virtue of the Delimitation Commission Act, 1952 as amended by the Delimitation Commission (Amendment) Act, 1954, the Chief Election Commissioner by a statuatory order re-determined the number of seats to be reserved for Scheduled castes in the House of people and in the Legislative Assembly for the State of Andhra on the basis of the corrected figures of Census population of Scheduled Castes by a competent Census authority. The corrected Census

figures showed a reduceion of 1,57,316 in the population of Scheduled Castes in Andhra and hence the number of seats reserved was correspondingly reduced following the formula prescribed under the provisions of the Constitution.

(b) 1. Member for the House of the people ;

2. Two Members for the State Legislative Assembly.

(c) The proposals are still under the consideration of the Election Commission.

(d) As the total number of seats for scheduled Castes have been reserved according to the provisions of the Constitution, there can be no re-opening of the question of the number of seats allotted to them.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ సమస్యను re-open చేసేందుకు అవకాశం లేదంటున్నారు. అంటే ఇప్పుడు reduce చేసినది reduce చేసినట్లుగా వుంటుందా ? Constituent Assembly allot చేసిన seat లు అదే విధంగా ఉంటాయా ?

THE HON. DR. B. GOPALA REDDI :—Assembly seats పెరుగుతాయి. Election Commission వారు ఆంధ్రకు 3 గ్గురు మెంబర్లు లోక సభకు, 24 గురు యీ శాసన సభకు ఉండాలని నిర్ణయించారు.

SRI P. RANGA REDDI :—Census ప్రకారం population తగ్గి పోయిందని కనుక్కొబడిందన్నారు. మొట్టమొదట ఏవిధంగా population ఉండింది ? తరువాత తగ్గడానికి కారణం ఏమిటి ? ప్రత్యేక Community ఏమయినా యిందులో కలిసిపోయి తప్పుగా లెక్క వేయబడిందా ?

THE HON DR. B. GOPALA REDDI :—అనంతపురం, కర్నూలు జిల్లాలలో కొన్ని Backward Classes, Communites ఉండగా వాటిని Harijan Communities క్రింద 1951 census లో చేర్చుకోబడి ఉన్నారు. తరువాత ఆ mistake కనుక్కొని ఆ Communities ను Backward Classes కు చేర్చి Harijans నుంచి తగ్గించేటప్పటికి 1,50,000 హరిజనుల సంఖ్య తగ్గిపోయింది.

28th March 1956]

SRI S. VEMAYYA :—1951 సంవత్సరంలో Census లెక్కల ప్రకారం seat లు అదనంగా రావడం జరిగింది. మరల 10 సంవత్సరాలు తరువాతనే census తీసుకుంటారు కదా యింతలోనే census మరల correct చేయడం మళ్లా seat లు తగ్గించడం ఎట్లా సంభవించిందో తెలుసుకోవచ్చా ?

THE HON. DR. B. GOPALA REDDI :—కొన్ని కొన్ని communities wrongfully included in the list. బోయి, వాల్మీకి ఇత్యాది backward classes గా ఉండవలసినవి Harijans లో చేర్చినారు. హరిజనులంటే ఎవరు అని definition క్రింద పెట్టుకున్నారు. దాని ప్రకారంగా వాల్మీకి బోయివగైరాలకులాలు హరిజనులక్రిందికి రావని, backward classes అనే ఉద్దేశ్యంతో deduct చేశారు.

Sri N. C. SESHADRI :—ఈ question లో "ఏ constituency effect అయినది" అనే దానికి ఉత్తరమివ్వలేదు. ఏ Constituency effect అయినదో తెలుపుతారా ?

THE HON. DR. B. GOPALA REDDI :—అదే నేను చెబుతున్నానుకదా.

" The proposals are still under consideration of the Election Commission "

ఈ Committee మొన్న తిరుపతిలో meet అయినది. దాంట్లో అంక సుందరం, కడియాల గోపాలరావు, T. N. వెంకటసుబ్బారెడ్డి, T. N విశ్వనాథ రెడ్డి, పెంచురామనాయుడు గారలు యింకా Election Commission నుంచి ఒకాయన సమావేశమైనారు. వారందరూ కూర్చుని proposals చేసినారు. అది Election Commission కు పంపించినారు. అది వాళ్లు approve చేసినట్లు మాకు ఏమీ communication రాలేదు.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, బోయి, వాల్మీకి సంఘాలు scheduled castes జాబితాలో యిప్పటివరకు ఉన్నాయి. అయితే యీ వివరాలనుబట్టి బోయి, వాల్మీకి కులాలను Scheduled Castes నుంచి మినహాయించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ ప్రభుత్వానికేమీ సంబంధంలేదు. Election Commission వాళ్ళే చూస్తున్నారు. వాళ్ల

definition ప్రకారంగా కొన్నికొన్ని communities పేర్లు ఏవిధంగా ఉన్నప్పటికీకూడా Scheduled Castes అవునా కాదా అనేటటువంటి విషయంవాళ్ళే నిర్ణయిస్తున్నారు. కాబట్టి Government యీ విషయంలో చర్యతీసుకోలేదు.

SRI A. KALESWARA RAO :—Scheduled Castes అంటే హిందువులలోని untouchables కదా ? కాబట్టి untouchables కానటువంటి వారంతా Backward Communities క్రిందకు రావడం అనేదే నా సిద్ధాంతం.

THE HON. Dr. B. GOPALA REDDI :—ఆయా కులాలవారు, నిమ్నజాతులవారు అవునాకాదా అనే విషయాన్ని గమనించే యీ విషయం నిర్ణయిస్తూ ఉన్నారు.

Sri G. YELLAMANDA REDDI :—అధ్యక్షా, ఇప్పుడు లెక్కల ప్రకారం ఒకలక్ష చిల్లర తగ్గిందని చెబుతున్నారు. దాని ప్రకారం Parliament కు ఒక seat తగ్గించాల్సిన అవసరం ఎల్లా కలిగింది ? 7 లక్షల ప్రాతిపదికమీద Parliament సభ్యులున్నప్పుడు ఒక లక్ష తగ్గిందని Inegligible గా ignore చేయకుండా ఒక సీటు తగ్గించడానికి కారణం ఏమిటి ?

THE HON. Dr. B. GOPALA REDDI :—బహుశా వేరేవివరాలున్నాయి. పోయినతడవ 3.6 వచ్చింది. అయినప్పుడు 4 క్రింద చేసినారు. 3.6లో నుంచి ఇప్పుడు 3.2 అవుతుంది. It is rounded off as 3.

Sri K. SUBBA RAO :—Scheduled Castes అనడం అంటరానివారనేకాదు. ఇతర వెనుకబడ్డ జాతులుకూడా అందులో ఉన్నారా ? లేరా ?

THE HON. Dr. B. GOPALA REDDI :—వారు Scheduled Casts వెనుకబడిన తరగతులువేరు. ఇప్పుడు Scheduled Castes వేరు, Tribal people వేరు, Backward Classes people వేరు. 3 different Classes ఉన్నాయి కాని ఒకదాంట్లో ఉంటే యింకోదాంట్లో ఉండడానికి వీలులేదు.

Sri VIJAYABHASKARA REDDI :—Commission మొన్న తిరుపతిలో meet అయినప్పుడు T.N. వెంకటసుబ్బారెడ్డిగారు తదితరులు Government తో సంప్రదించి Government వారు ఏమయినా proposals పెడితే వాటిని discuss చేశారా ? Discuss చేస్తే ప్రభుత్వాని కేమయినా తెలుసునా ?

THE HON. DR. B. GOPALA REDDI :—ఈ Government కు ఏమీ సంబంధం లేదు. వాళ్లు discuss చేసినారు. మన Assembly నుంచి

కొందరు member లు ఉన్నారు. పార్లమెంటునుండి కొంతమంది మెంబర్లు ఉన్నారు. Election Commission వాళ్లు figures అంతా చూసుకొని వాళ్లు నిర్ణయం చేసుకుంటారు. సిఫార్సు క్రింద Election Commission వారు దానిని ఆమోదించినారు. కాని సంప్రదించడం జరగలేదు. ఏ నిర్ణయం చేసినప్పటికీకూడా definite గా మాకేమీలేదు Election Commission వారు దానిమీద ఉత్తర్వులు pass చేశారు.

SRI S. VEMAYYA —50 percent కు అదనంగా ఉన్నప్పుడు ఒక seat గా పరిగణింపవచ్చునని మంత్రిగారు చెప్పినారు. ఇప్పుడు అక్కడున్నటు వంటి లెక్కలలో 50 percent అదనంగా ఉన్నాకూడా, ఆ లెక్క తీసుకున్నా కూడా ఒకసీటు తగ్గించబడవలసివస్తుంది. దీనిని గురించి Government కు తెలియచేస్తారా ?

The Hon. DR. B. GOPALA REDDI :— 26 సీట్లు నిర్ణయించి నప్పుడు బహుశా 1,04,000 కు ఒకసీటు చొప్పున నిర్ణయించారు. ఇప్పుడు 1,57,000 తగ్గినది కాబట్టి 24.3, వచ్చినా అదికూడా 24 అవుతుంది. ఇంతకు ముందు 25.6 వచ్చిందనుకోండి. అప్పుడు 26 అవుతుంది. ఒకలక్ష తగ్గిపోయి నప్పటికీ 24 క్రిందికి వస్తుంది. ఇది మేము లెక్కలు వేసినదికాదు.

Election Commission was assisted by 2 members of the Parliament, 2 members of this Assembly. వాళ్లు work out చేస్తున్నారు ఏ జిల్లాలో తగ్గించాలి ? అనంతపురంలో తగ్గించాలా, కర్నూలు జిల్లాలో తగ్గించాలా, West Godavari లో తగ్గించాలా, యీ విషయాలన్నీ కూడా చర్చించినట్లు తెలుస్తున్నది. ఇదంతాకూడా వాళ్లు చూచుకొంటున్నారు.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ కమిషన్‌వారు ఏఏ కులాలను Backward Class క్రింద నిర్ణయించారు. హరిజను లను ఏ విధంగా count చేశారు ? ఈ వివరాలతో list ఇస్తారా ?

THE HON. DR B. GOPALA REDDI :—వాల్మీకిఅని, ఇంకోటి ఒకటి, ఈ రెండు తెగలు ఇంతకుముందు షెడ్యూలు జాతులక్రింద ఉన్నాయి. ఇప్పుడు వారు షెడ్యూలు జాతులు కారని నిర్ణయించారు.

SRI G. NARASIMHA MURTY :—అధ్యక్షా తూర్పుగోదావరి, కృష్ణా, పశ్చిమగోదావరి జిల్లాలలో ఉన్నటువంటి శెట్టిబలిజ అనేకులాన్ని, 1948

సంవత్సరములో మద్రాసు ప్రభుత్వంవారు Backward class క్రింద చేర్చారు. అదేపేరుతో రాయలసీమలో ఉన్నటువంటి వారిని Backward Class లో చేర్చ లేదు. కారణము తెలుపుతారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఉత్తరసర్కారులలో ఉన్న శెట్టిబలిజ, రాయలసీమలో ఉన్న శెట్టిబలిజఅనే పేర్లు రెండూ ఒకటేఅయినా కులము మాత్రం ఒకటికాదు. ఈ విషయంలో జిల్లాకలెక్టర్లను రిపోర్టులు అడుగబడ్డాయి. Backward Classes కు సంబంధించి కులపాసంఘ సమావేశములోకూడా చర్చించబడ్డది. రిపోర్టులుఅన్నీ వచ్చినతరువాత ప్రభుత్వం పరిశీలనచేసి తగిననిర్ణయము చేస్తుంది.

*Repairs to the tank of Rajuvari Chintalapalem.*

659-A.—

S. N. Q. No. 1293-G. Q.—SRI B. RAMAKRISHNA REDDI :—Will the Hon. the minister for Revenue be pleased to state :

(a) whether any representation was made by the ryots of Rajuvari Chintalapalem, Kavali Taluk, Nellore District, regarding the bad condition of the tank for the last ten years ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the negative.

(b) Does not arise.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ప్రభుత్వానికి ఏ దరఖాస్తు రానప్పటికిన్నీ ఆ చెరువు 10 సంవత్సరములనుంచి మరమ్మతులు లేకుండాఉన్నదన్న సంగతి తెలుసునా ? తెలుస్తే దానిని మరమ్మతు చేయడానికి చర్యలు తీసుకుంటుందా ?

THE HON. Sri K. CHANDRAMOULI :—ప్రభుత్వానికి ఇంతవరకు representation రాలేదు. అటువంటిదివస్తే తప్పకుండా ఆలోచిస్తాము

***Re-classification of land.***

659-B.—

**S. N. Q. No. 1306-C. Q.—SRI V. VISWESWARA RAO :—Will the Hon. the Minister for Revenue be pleased to state :**

28th March 1956]

(a) whether it is a fact that the re-classification of land will also be taken up as a part or Banjar assignment programme ,

(b) if so, how many acres of land have been re-classified ; and

(c) if not, why ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the negative.

(b) and (c) Do not arise.

STARRED QUESTIONS.

*Licensing of Document Writers of the Registration Department.*

639—

*746 Q.—SRI B. V. SUBBA REDDI :—Will the Hon. the Minister for Revenue be pleased to state :

whether there is a proposal under the consideration of the Government for licensing the Document Writers of the Registration Department and if so, at what stage the matter stands ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

Yes, the Government have had under consideration a proposal to amend the Indian Registration Act, 1908, making *inter alia* provision for licensing of Document Writers.

The matter has been referred to the Govenment of India for their concurrence.

*Tuberculosis Sanatorium at Bugga.*

649—

*507 Q.—SRI P. VENKATASUBBAYYA :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state :

(a) whether the Cuddapah Municipality has submitted proposals to start a Tuberculosis Sanatorium at Bugga near Cuddapah ; and

(b) if so, the action taken by the Government on them ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The answer is in negative.

(b) Does not arise.

SRI P. VENKATASUBBAYYA :—ఈ క్షయ చికిత్సా కేంద్రం పెట్టడానికి అనుకూలమైన వాతావరణము అక్కడఉన్నది కనుక స్థాపించడానికి ఆలోచిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—అక్కడ పెట్టడానికి ఆలోచనలేదు. ఒక అసోసియేషన్ అక్కడ మాజీ ఉద్యోగులకు క్షయ చికిత్సాకేంద్రం పెట్టవలెనని ప్రయత్నంచేశారు. ఈ విషయం D. M. S. కు refer చేశాము ఆయన నెల్లూరులోగాని, మంగళగిరిలోగాని, వారికి Special wards కట్టిస్తేచాలు అన్నారు. అందువల్ల దానిని ఆపడంఅయింది.

SRI E. AYYAPPA REDDI :—అధ్యక్షా, ఆంధ్రదేశంలో ఎక్కడైనా T. B. Sanitorium ను start చేసే proposal ఏమైనాఉన్నదా ? ఇటీవల కర్నూలుకు సమీపములో జగన్నాథగట్టుదగ్గరగాని, కర్నూలుజిల్లా ప్యాపలిదగ్గరగాని దానికి అనుకూలమైన పరిస్థితులు ఉన్నాయి. అక్కడ Sanitorium ను ఏర్పాటు చేయడానికి చాలా కాలంనుంచి ప్రయత్నములు జరుగుతున్నాయి. దానికి ప్రభుత్వం ఏమైనా సహాయముచేయగలదా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—రెండవ పంచవర్ష ప్రణాళికలో గుంటూరుజిల్లా మంగళగిరిలోను, కర్నూలులోను, విశాఖపట్టణంలోను 3 శానిటోరియములు ఏర్పాటుచేయడానికి 10¾ లక్షలు రూపాయిలు కేటాయించారు మంగళగిరిలో వెంటనే స్థాపించడానికి సుమారు 4 లక్షల రూపాయిలు వసూలుచేశారు. గవర్నమెంటు స్థలములో ఆ శానిటోరియం కట్టబడుతున్నది. కర్నూలుజిల్లా విషయములో ప్యాపలిదగ్గర మానివేసి, జగన్నాథగట్టువద్ద ఏర్పాటు చేయడము విషయంలో, ఇదివరకు వెంకటరావుగారు మనవిచేశారు, డబ్బువిషయంలో మాత్రం ఇదివరకు Tuberculosis Association వారు ప్రజలను ఒక లక్షరూపాయిలు ఇవ్వమన్నారు. ఇవ్వలేమంటే 50 వేలుఅయినా ఇవ్వమన్నారు. తరువాత అది ఏస్థితిలోఉన్నదో ఇంకో ప్రశ్నవేస్తే వివరంగా చెబుతాను.

Sri S. BRAHMAYYA :—అధ్యక్షా, పశ్చిమగోదావరిజిల్లా తాడేపల్లిగూడెంలో ఒక శానిటోరియం ఏర్పాటుచేయడానికి ప్రపోజల్సు ఉన్నాయి. ధాని

నిమిత్తం లక్షలాదిధనంకూడా సేకరించబడ్డది. అది ఇప్పుడు ఏ పరిస్థితిలో ఉన్నదో తెలవిస్తారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—వేరే ప్రశ్న వేస్తే మనవిచేస్తాను.

*Grow More Food Concessions.*

660—

*900 Q.—SRI S. VEMAYYA:—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

whether Government propose to extend the Grow More Food Concessions to those who Cultivate lands whether Government or private with food crops now in the State in Fasli 1365 ?

THE HON SRI K. OBULA REDDI :—

The Government have already extended the following Grow More Food Concessions upto the end of Fasli 1365.

(1) Cultivation of Compounds of institutions.

(2) Cultivation of backyards.

(3) Cultivation of vacant village or town sites.

(4) Cultivation of lands near-sea-front.

(5) Waiver of penalties for technical infringment of irrigation rules.

(6) Exemption from water cess in respect of certain lands newly cultivated in Anantapur Districts.

(7) Cultivation of lands in coastal areas in Godavari, Krishna and Guntur Districts.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, లోగడఉన్నటువంటి grow more food, scheme లేదని, నాయిటాలువగ్గారాలు, ఆక్షేపణలేని భూములకు పెనాల్టీలు విధిస్తున్నారు. గాబట్టి ఆ Grow More Food Scheme ఉన్నదని ఉద్యోగస్థు అందరికీ ఆదేశములు పంపిస్తారా ?

THE HON. SRI K. OBULA REDDI :—పంపిస్తాము.

SRI B. RAMA REDDI:—అధ్యక్షా, అధికాహారోత్పత్తి స్కీముక్రింద concession ఇస్తూ చెలువు పోరంబోకునిమిత్తమైన బంజరుభూములు ఎవరుఅయినా సాగుచేసుకుంటున్నట్లయితే, వాళ్లకు పట్టాలుయివ్వడానికి అభ్యంతరములేదని చెప్పినందువల్ల చాలామంది ఖర్చులుపెట్టుకొని సాగుచేసుకుంటున్నారు. ఇప్పుడు దానిని బహిష్కరిస్తున్నారు కాబట్టి, వాళ్లకు పట్టాలు ఇచ్చి concession ఏమైనా ఇస్తారా.

THE HON. SRI K. OBULA REDDI:—ఆలోచిస్తాము.

SRI G. YELLAMANDA REDDI:—అధ్యక్షా, Grow More Food Scheme క్రింద పోరంబోకు భూములన్నింటినీ వ్యవసాయకూలీలకు సాగుచేసుకోవడానికి ప్రభుత్వమువారు ఇదివరకు ఇచ్చిఉన్నారు. వాటిని evict చేయమని ప్రభుత్వము ఇదివరకు notice లు ఇచ్చిఉన్నది. చాలామందిమీద పెనాలిటీలు విధించారు ఆవిషయం ప్రభుత్వదృష్టికి తీసుకురావడం జరిగింది. అందువల్ల మంత్రిగారు ఆ భూములన్నిటినీ evict చేయడానికి వీలులేదని ఉత్తర్వులు పంపుతారా ?

THE HON. SRI K. OBULA REDDI :—ఈ ప్రశ్నకు ఇదివరకే సమాధానము చెప్పబడ్డది.

## *Retrenchment of the Andhra Staff working in Tungabhadra Project Works.*

661—

*942 Q.—SRI M. NAGI REDDI .—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether it is a fact that Government propose to retrench the Andhra Staff who are working in Tungabhadra Project works by March, 1956 ;

(b) whether it is a fact that though the Andhra Non-Gazetted Government Officers working in Tungabhadra Project works are outside the Andhra State are not getting the special privileges like deputation pay etc. ; and

(c) whether there is any proposal with the Government to absorb all the emergency Andhra Personnel working in Tungabhadra Project Works into the regular State Services ?

28th March 1956]

THE HON. SRI N. SANJEEVA REDDI.—

(a) No.

(b) Andhras Working in the Tungabhadra Board are not being paid any deputation allowance The question is however, under the consideration of the Tungabhadra Board.

(c) The matter is under the consideration of the Government.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, వారికి deputation allowances ఇవ్వమని మన ప్రభుత్వంవారు ఏమైనా recommend చేశారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—మన ప్రతినిధులు కూడా బోర్డులోవున్నారు కాబట్టి. ప్రత్యేకంగా ఏ రికమండేషను చేయాలో ఆలోచిస్తున్నారు.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఇది ఎంతకాలమునుంచి ప్రభుత్వ ఆలోచనలో ఉన్నది ? ఎంతకాలములో దీనికి నిర్ణీతమైన ఉత్తర్వులు ఇస్తారు.

THE HON. SRI N. SANJEEVA REDDI:—ప్రశ్నకు చెప్పిన సమాధానము వినకుండా, బోర్డు ఆలోచిస్తున్నది అంటే, ప్రభుత్వ ఆలోచనలో ఎంత కాలంలో ఉన్నదని అడిగితే ఏమి సమాధానం చెబుతాను?

*Repairs of tanks in Bobbili Taluk.*

662—

* 664 Q.—SRI P. GUNNAYYA.—Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) the amount granted to the Manager of Bobbili Estate towards the repairs of tanks in Bobbili Taluk for the year 1955 ;

(b) whether any repairs to the tanks in Bobbili Estate have been done in the year 1955 and if so, the number of tanks repaired and the villages in which they were repaired ; and

(c) whether any repairs of the tanks in Pathapatnam Estate have been done in the year 1955 and if so, the number

of tanks repaired and the villages in which they were repaired ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) An amount of Rs. 43,767 was granted to the estate's Manager, Bobbili towards repairs of tanks in Bobbili taluk for the year 1955-56.

(b) and (c) :—A statement * showing the names of the villages affected and the names of the tanks repaired is placed on the Table of the House.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, మంత్రిగారు తెలుగులో చెబితే తరువాత సప్లిమెంటరీ ప్రశ్న వేస్తాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—బొబ్బిలితాలూకాలో ఉన్నటువంటి చెఱువుల మరమ్మతులకోసము, 43,767 రూపాయలు 1955-56 సంవత్సరానికి ఇవ్వబడ్డది. తక్కినచెఱువులు, వరదలవల్ల నష్టపడినవాటి list అంతా కూడా ఇదివరకు House ఎదుట పెట్టబడ్డది.

*Pig breeding centres in the State.*

663—

* 1140 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

whether there are proposals with Government to start pig breeding centres in each District now ?

THE HON. SRI K. OBULA REDDI :—

No, Sir.

SRI S VEMAYYA :—ప్రయివేటువ్యక్తులపైన పందులు పెంచుతుంటే వారికి subsidy ఇచ్చి encourage చేయుటకు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. OBULA REDDI :—ఈ రెండవ పంచవర్ష ప్రణాళికకాలంలో pig breeding stations పెట్టాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఒకటి మదనపల్లెలోను, వీలుగాఉంటే రెండవది సర్కారుజిల్లాలలోను పెట్టించాలనుకుంటున్నారు. వ్యక్తులకు subsidy ఇచ్చి దీనిని వృద్ధిలోకి తీసుకురావాలని ప్రభుత్వం దృష్టికి రాలేదు. ఇప్పుడు వేమయ్యగారు ప్రభుత్వదృష్టికి తెచ్చినారు కనుక ఆలోచిస్తాము.

* Vide Appendix at pages 443 infra.

28th March 1956]

*Taking of the road connecting Dharmavaram and B.C.C. Road by the Highways Department.*

664—

* 984 Q.—SRI P VENKATARAMANAPPA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(*a*) whether it is a fact that a portion of road connecting Dharmavaram and B C.C. Road at Koderu, Hindupur Taluk, is taken up by the Highways Department upto Gummiahgaripalli crossing , and

(*b*) if so, when the remaining portion will be taken up ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(*a*) The answer is in the negative.

(*b*) The matter is under consideration.

SRI A. VENKATARAMAYYA :—ఈ రోడ్డులు చాలా అధ్వాన్న పరిస్థితులలో ఉన్నవి కనుక వీటిని బాగుచేయుటకు ప్రభుత్వంవారు పూనుకుంటారా ?

THE HON. N. SANJEEVA REDDI:—చాలా రోడ్లులు ఇంతకన్నా అధ్వాన్న పరిస్థితులలో ఉన్నాయి. కాని budget లో 11 లక్షలు మాత్రమే కేటాయించబడినది. అందువల్ల ఒకజిల్లాకు ఒకలక్షకూడ ఖర్చుచెయుటకు వీలులేకుండా ఉన్నది. ప్రభుత్వానికి ఇప్పుడున్న ధనాభావంచేత వెంటనే బాగుచేయుటకు వీలులేక పోతోంది.

*House sites to the Harijans of Rolupad village.*

665—

*922 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Government provided house sites to the Harijans of Rolupad village, Tiruvur taluk of Krishna district, otherwise ; and

(b) if not, the reasons for withdrawal of land acquisition proceedings in G.O. Rt. No. 607, dated 9—11—1955 ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The answer is in the negative.

(b) The Land Acquisition Proceedings for provision of house sites to the Harijans of Rolupad Village, Tiruvur Taluk, Krishna District were not initiated and the question of withdrawal of L.A proceedings does not arise in this case.

Only L.A. proceedings relating to the provision of a burial ground far Harijans in Rolupad village in Gudivada taluk were withdrawn in G.O. Rt. No. 607 Education and Fndowments, dated 9—11—1955 for the reasons that there was no need to acquire private land when Government poramboke land in S. No. 16, is available.

(a) లేదండి.

(b) కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా రోలుపాడు గ్రామ హరిజనులకు ఇండ్ల స్థలములనిమిత్తం భూమి సేకరణ కార్యక్రమం ప్రారంభించబడలేదు. అందుచేత ఉపసంహరించుకొనబడింది అనే ప్రశ్న ప్రసక్తిలేదు గుడివాడ, రోలుపాడు గ్రామ హరిజనులకు శ్మశానస్థలం ఏర్పాటు విషయమై ఆలోచనలో నున్నది.

SRI S. VEMAYYA :—ఈ శ్మశానస్థలమును గురించి ప్రభుత్వం ఎంత కాలం దర్యాప్తుచేసినది ? ఎప్పుడు విరమించుకొన్నది ?

THE HON. SRI G. LATCHNNA :—అక్కడ ప్రభుత్వపు భూమి ఉన్నందువల్ల ప్రయివేటు భూమియొక్క acquisition ఉపసంహరించు కొనబడినది. ప్రభుత్వ భూమి ఇవ్వడానికి ఆలోచన జరుగుతున్నది.

SRI S. VEMAYYA :—అక్కడ ప్రభుత్వపు భూమి ఉన్నప్పుడు land acquisition proceedings ప్రారంభించవలసిన అవసరం ప్రభుత్వమునకు ఎందుకు కల్గినది ?

THE HON. SRI G. LATCHANNA :—అటువంటి తప్పుడుపనిని దిద్దు కొనుటకు జరిగింది. ఆ తప్పుపనిచేసిన వారిదగ్గరనుంచి సంజాయిషీ కోరబడినది.

*House sites to the Harijans of Ragulapadu village.*

666—

*529 Q.—SRI M. RAJARAM :—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state ;

28th March 1956]

(a) whether it is a fact that the Government have kept pending the Land Acquisition proceedings, for the provision of house sites to the Harijans of Ragulapadu village in Uravakonda Sub-Taluk of Anantapur District ;

(b) if so the reasons therefor ; and

(c) the action taken in the matter ?

THE HON. SRI G. LATCHANNA .—

(a) The answer is in the negative.

(b) and (c) Do not arise.

*House sites to the Harijans of Motur Village.*

667—

*920 Q.—SRI S. VEMAYYA.—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state :

(a) whether the Harijans of Motur Village, Gudivada Taluk of Krishna District were provided house sites otherwise ; and

(b) if not, the reasons for the withdrawal of land acquisition proceedings in G. O. Rt. No. 490, dated 10—10—1955 ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) The answer is in the negative.

(b) The Land Acquisition proceedings for provision of house sites to the Harijans of Motur Village, Gudivada Taluk, Krishna District were not initiated and the question of withdrawal of Land Acquisition proceedings does not arise in this case. Only land acquisition proceedings relating to to the provision of a burial ground for Harijans in Motur Village, in Gudivada Taluk were withdrawn in G.O. Rt. No. 490, dated 10—10—1955 for the reason that there was no need to acquire private land when Government poramboke land is available for the purpose.

(a) తెలంది,

[28th March 1956

కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా మోటూరు గ్రామహరిజనులకు ఇండ్ల స్థలాలు ఇచ్చే విషయమై భూమి సేకరణ కార్యక్రమం ప్రారంభించబడలేదు అందువల్ల ఉపసంహరణ అనే ప్రసక్తిలేదు. గుడివాడ తాలూకా మోటూరు గ్రామ హరిజనులకు స్మశానస్థలమునకు సంబంధించిన భూమి సేకరణ కార్యక్రమము ఉపసంహరించబడినది.

SRI S. VEMAYYA :—ఎందువల్ల స్మశానస్థలం కార్యక్రమం ఉపసంహరించు కొనబడినది ?

THE HON. G. LATCHANNA :—మోపపాడు గ్రామమునకు ఇచ్చిన సమాధానమే దీనికి వస్తుంది.

SRI S. VEMAYYA :—అక్కడ ప్రజలు దీనికొరకు ధరఖాస్తు పెట్టినారు. దానిని ప్రభుత్వంవారు ఎంత కాలందర్యాప్తుచేసి విరమించుకున్నారో తెలుసుకొనవచ్చునా ?

THE HON. SRI G. LATCHANNA .—ఇప్పుడు ఆ వివరాలన్నీ నా దగ్గర సిద్ధంగాలేవు. వేరే ప్రశ్నవేసినట్లయితే తప్పకుండా చెబుతాను.

*Auction of fishing rights in ponds, streams etc.*

668—

*722 Q.—SRI E. AYYAPU REDDI:—Will the Hon. the Minister for Agriculture be pleased to state :

(a) whether the Government are auctioning every year the rights in fishing ponds, streams, rivers and canals in the State ; and

(b) if so, the income therefrom in the year 1954-55 ?

THE HON. SRI K. OBULA REDDI :—

(a) The fising rights in ponds, tanks, streams, rivers and canals are generally sold in public auction every year. But in cases where the local Fishermen Cooperative Societies or Panchayats apply for fishing rights they are leased out to them without auction for reasonable rentals.

(b) An amount of Rs. 1,99,486 was realised in 1954-55.

28th March 1956]

చెరువులు, గుంటలు, కాల్వలు మున్నగు వాటికి మామూలుగా వేలం వేస్తున్నారు. Fishermen Co-operative Societies ఉన్నట్లయితే వాటిని auction లేకుండా ఏదో కొంత మొత్తం ఏర్పాటుచేసి వారికి ఇస్తారు.

SRI E. AYYAPU REDDI :—వేలం పాటపెట్టిన చాలా గ్రామములలో అక్కడి ప్రజలు నామినల్ కొని తరువాత వారిలో వారు auction వేసుకొని ఎక్కువ లాభాలను పొందుతున్నారు. అందువల్ల పంచాయతీ బోర్డులున్నచోట్ల వేలం పాట వేసే అధికారం పంచాయతీ బోర్డులకు అప్పగించినట్లయితే పంచాయతీ బోర్డులకు, ప్రభుత్వమునకుకూడా ఎక్కువ లాభదాయకంగా ఉంటుంది. ఈ విషయమై ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. OBULA REDDI :—పంచాయతీ సరిహద్దులలో చెరువులుఉంటే అటువంటి వాటి విషయంలో పంచాయతీ బోర్డులకు ప్రత్యేకమయిన preference ఇస్తున్నారు.

SRI G. YELLAMANDA REDDI :—అధ్యక్షా! ఈ societies ఉన్న చోట్ల సొసైటీలకీ priority ఇవ్వబడుతున్నదని మంత్రిగారు చెప్పినారు. పంచాయతీ బోర్డులకు ఇవ్వబడుతున్నదని ఇప్పుడు చెబుతున్నారు.

THE HON. SRI K. OBULA REDDI :—పంచాయతీ సరిహద్దులలో ఉంటే బావులు, జలాధారములు మున్నగువాటిలో చేపలు పట్టుకొనటకు పంచాయతీ బోర్డువారికి preference ఇస్తున్నాము. పంచాయితీ బోర్డు సరిహద్దులకు బయట ఉంటే జలాధారాలలో Fisherman Co-operative Societies కు preference ఇస్తారు. వాటి తరువాత పంచాయతీ బోర్డులకు ఇస్తారు.

SRI S. VEMAYYA :—దీని విషయంలో Fisherman Co-operative Societies కు అధికారం ఉన్నదో, Revenue Department కు అధికారం ఉన్నదో తెలియుటలేదు. ఇటువంటి తికమకలం లేకుండా ఏదో ఒక నిర్దిష్టమైన department కు ఆ అధికారం ఇవ్వడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI K. OBULA REDDI :—ఇంతవరకు Revenue Department కు సంబంధించిన G.O. లు ఉన్నాయి. అట్లాగే Agriculture Department కు, Fisheries Department కు సంబంధించిన G.O. లు ఉన్నాయి. వాటిది వీటికి, వీటిది వాటికి కొంత confusion కల్గిస్తు ఉంటోంది. దీన్ని గురించి కొంత complaint ఉన్నమాట వాస్తవమే. దాన్నిగురించి ఆలోచిస్తాము.

[28th March 1956

## UNSTARRED QUESTIONS.

*Loans and subsidies received from the Central Government.*

10—575 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA.— Will the Hon the Chief Minister be pleased to state—

(a) the amount received from the Central Government by way of (1) grants, (2) loans, and (3) subsides and their conditions, from 1st October 1953 to 31st March 1954, from 1st April 1954 to 31st March 1955 and from 1st April 1955 to 1st October 1955, and

(b) if any of them have lapsed, why and where and the amount ?

10—575—

A.—(a) The information * required by the member is placed on the Table.

(b) Information regarding the lapses is given in the statement placed on the Table. As the expenditure on the various schemes is incurred in the respective districts, the lapses in the provision should be deemed to have occurred at the district level. The reasons for the lapses are given in the last column of the statement.

*Number of acres to be irrigated under the Nagarjunasagar Project.*

11—

763 Q.—SRI G. SURYANARAYANA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of acres of land that is going to be irrigated under the Nagarjunasagar Project.

(b) the number of acres in Andhra and in Hyderabad States ;

---

* Printed at Pages 451 infra.

28th March 1956]

(c) whether the Government will be pleased to place the paper on the Table of the House giving the details of the number of acres of land going to be irrigated under the same project, District-war in Guntur, Nellore, Krishna, Kurnool and Markapur taluk ; and

(d) the number of acres which is banjar land and the number of acres which is cultivable waste land with the figures District-war ?

11—763—

A.—(a) 32·68 lakhs of acres.

(b) Andhra area—Acres 24·73 lakhs.
Hyderabad area—Acres 7·95 lakhs.

(c) The approximate number of acres of land going to be irrigated under the Nagarjunasagar Project (Districtwise) is given below :—

| | | ACRES. |
|---|---|---|
| Guntur | ... | 1,094,727 |
| Nellore | ... | 8,39,475 |
| Kurnool | ... | 8,836 |
| Krishna | ... | 5,30,000 |
| Total | ... | 24,73,038 |

(d) The Districtwise particulars of cultivable waste lands are approximately as follows :—

| | | ACRES. |
|---|---|---|
| Guntur district | ... | 58,407 |
| Nellore district | ... | 18,542 |
| Krishna district. | | 4,028 |
| Kurnool district | ... | 8,089 |
| Total | ... | 89,066 |

*Staff working in the Revenue Department in Anantapur District.*

12—

582 Q.—SRI M RAJARAM :—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) (i) the number of lower division clerks ,

(ii) the number of upper division clerks ,

(iii) the number of Deputy Tahsildars ;

(iv) the number of Tahsildars , and

(v) the number of Revenue Inspectors in the Revenue Department in Anantapur district ;

(b) the number of Harijans out of them ; and

(c) the number of Backward Classes ?

12—582—

A.—The particulars are furnished in the statement.*

13—

*Sales of cloth by th Regional Marketing Officers.*

510. Q.—SRI P. VENKATASUBBAIAH ·—Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the amount of sales of cloth turned out by the Regional Marketing Officers in the State month-war and office-war ; and

(b) the number of sales emporium working under each Marketing Officer, the staff that are manning the emporium and the cost incurred on them so far from the Cess Fund ?

13—510—

A.—Clauses (a) and (b).—A statement ** containing the information is placed on the Table of the House.

---

* Printed as Appendix I on page 488 infra.

** (Printed at Pages 486 infra.)

28th March 1956]

*Suits, appeals and applications filed from the Vizianagaram District Munsiff area in the Sub-Court and District Court, Visakhpatnam.*

14—

*952 Q.—SRI G. SURYANARAYANA :—Will the Hon. the Deputy Chief Minister be pleased to state how many suits, appeals and applications are held from the Vizianagaram District Munsiff area in the Subordinate Judge's Court and District Court at Visakhapatnam in the year 1951 to 1955 (year-war)?

14—952—

A —The following information is furnished :—

| | 1951 | 1952 | 1953 | 1954 | 1955 |
|---|---|---|---|---|---|
| Suits ... | 19 | 32 | 22 | 17 | 6 |
| Appeals ... | 118 | 85 | 119 | 155 | 128 |
| Applications | 21 | 29 | 18 | 24 | 27 |

*Leather goods purchased by the Collectors for official use in the districts.*

15—

651 Q.—SRI M. RAJESWARA RAO :—Will the Hon. the Minister for Revenue be pleased to state :—

(a) whether any leather goods are being purchased by the Collectors for official use in the districts ; and

(b) if so, the expenditure incurred on such leather goods in each district during the year 1954-55 ?

15—651—

A.—(a) & (b) No leather goods were purchased by Collectors for official use in the districts during 1954-55.

*Community Projects, Community Development Blocks and National Extension Service Blocks in the State.*

16—

816 Q.— SRI T. G. THIMMAYYA SETTY : Will the Hon. the Minister for Planning and Industries, be pleased to state:—

(a) the number and names of Community Projects, Community Development Blocks and National Extension Service Blocks in the State now ; ..

[28th March 1956

(b) the number of jeeps supplied to them ; and

(c) the reasons for the non-supply of jeeps to Peddathumbalam, Kosagi and Nandavaram National Extension Service Blocks in Kurnool district ?

16—815—

A.—*Clause* (*a*)—

(*a*) *Community Projects*—2

1. Kakinada-Peddapuram Project.
2. Kurnool-Cuddapah Canal Project.

(*b*) *Community Development Blocks*—13.

1. Vayalpad.
2. Ichapuram.
3. Pallipat.
4. Amadalavalasa.
5. Rajanagaram.
6. Pendurti.
7. Bhimadole.
8. Nuzvid.
9. Ammanabrolu.
10. Venkatachalam.
11. Alur.
12. Kodiganihalli.
13. Jammalamadugu.

*National Extension Service Blocks*—22

1. Madakasira.
2. Nagari.
3. Korukonda.
4. Chintalapudi.
5. Yerragondapalem.
6. Gara.
7. Podalakur.
8. Kotauratla.
9. Nakkapalli.
10. Maddipad.
11. Tiruvur.
12. Penukonda.

13. Koyyalagundem.
14. Giddalur.
15. Dinnadevarapadu.
16. Sabbavaram.
17. Macherla
18. Peddthumbalam.
19. Kosagi.
20. Nandavaram.
21. Devanakonda.
22. Talupula.

*Clause* (b).—The two Community Project, viz., Kakinada-Peddapuram and Kurnool-Cuddapah Canal are supplied with four jeeps each.

Two Community Development Blocks, viz., Vayalpad and Ichapuram are supplied with two jeeps each and the remaining eleven Community Development Blocks are supplied with one jeep each so far.

Sixteen National Extension Service Blocks, are supplied with one jeep each and the six National Extension Service Blocks which have been opened on 2nd October 1955, viz., (1) Pedthumbalam, (2) Kosagi, (3) Nandavaram, (4) Devanakonda. (5) Macherla, and (6) Talupula have not yet been supplied with jeeps.

*Clause* (c).—Indents for the supply of jeeps were placed with the Community Projects Administration and their supply is awaited. They will be supplied in the next consignment of jeeps to be allotted to this State.

***Loans granted to Ryots under all Heads (Takkavi, Land Improvement Loans, etc.)***

17—

677 Q.—**SRI M. RAJESWARA RAO**: Will the Hon. the Minister for Revenue be pleased to state:—

(a) the total amount of loans granted to ryots under all heads (Takkavi, Land Improvement Loans, etc.), (i) In

each district and (ii) in each of the taluks of Krishna and West Godavari districts during the financial years 1953-54 and 1954-55 ;

(b) the total amount of loans collected ,

(i) in each district , and

(ii) in each of the taluks of Krishna and West Godavari districts during the period , and

(c) the total amount of loans outstanding—

(i) in each district ; and

(ii) in each of the taluks of Krishna and the West Godavari districts on 31st March 1955 ?

17—667—

A.—The information * is placed on the Table of the House.

*Total expenditure incurred under the Head "Capital Outlay" on Electrical Undertakings.*

18—

675 Q.—SRI M. RAJESWARA RAO .—Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the total expenditure incurred under the head "Capital Outlay" on electrical undertakings up to 31st March 1953 and during the period from 1st April 1953 to 31st March 1955 ; and

(b) the number of villages in each district and in each of the taluks of Krishna district, for which Electricity was supplied on 31st March 1953 and on 31st March 1955 ?

18—675—

| | RS. LAKHS. |
|---|---|
| A.—(a) (1) Total expenditure incurred under the head "Capital Outlay" on electrical undertakings up to 31st March 1953 excluding portion transferred to Mysore .. | 1,389 |

*Printed as Appendix II on pages 489 infra.

28th March 1956]

| | |
|---|---|
| (2) Capital outlay during the period from 1st April 1953 to 31st March 1955 .. | 1,206 |
| Total ... | 2,595 |

(*b*) (1) Number of villages in each district for which electricity was supplied on 31st March 1953 and on 31st March 1955 are as follows —

| District. | | Number of villages electrified as on 31st March 1953. | Number of villages electrified as on 31st March 1955. |
|---|---|---|---|
| 1. Srikakulam | . | 19 | 25 |
| 2. Visakhapatnam | .. | 36 | 45 |
| 3. East Godavari | ... | 37 | 61 |
| 4. West Godavari | ... | 40 | 68 |
| 5. Krishna | ... | 61 | 81 |
| 6. Guntur | ... | 33 | 34 |
| 7. Nellore | ... | 4 | 20 |
| 8. Anantapur | ... | 8 | 35 |
| 9. Kurnool | ... | 8 | 15 |
| 10. Cuddapah | ... | 5 | 14 |
| 11. Chittoor | ... | 76 | 100 |
| | | 327 | 498 |

(2) Number of villages electrified in each taluk in Krishna district for which electricity was supplied on 31st March 1953 and on 31st March 1955, are as follows .—

| Taluk. | | Electrified as on 31st March 1953. | Electrified as on 31st March 1955. |
|---|---|---|---|
| 1. Bandar | ... | 3 | 3 |
| 2. Ganavaram | ... | 20 | 24 |
| 3. Gudivada | ... | 1 | 5 |
| 4 Nuzvid | ... | 11 | 12 |
| 5. Vijayavada | ... | 26 | 37 |
| | | 61 | 81 |

*Amount Spent on Famine Works in the State.*

19—

678 Q —SRI M RAJESWARA RAO .—Will the Hon the Minister for Revenue be pleased to state the amount spent on famine works in each district from (i) 1st April 1952 to 31st March 1953 , and (ii) 1st April 1953 to 31st March 1955 ?

19—678—

A.—A statement * containing the particulars is placed on the Table of the House. The amounts include item such as expenditure on account of gruel centres for weavers, cash grants to victims of fire accidents, and relief to person affected by floods.

*Amount sanctioned for the Panchayat Boards towards half grant works.*

20—

608. Q —SRI M. NAGI REDDI :—Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) the total amount sanctioned by the Government for the Panchayat Boards towards half grant works for the year 1955 56 ; and

(b) the districtwari allotments for Class I and II Panchayats—separately ?

20—608—

A—(a) Rs. 3 lakhs.

(b) The statements ** showing the allotments are placed on the Table of the House.

*Private dairies in the State.*

21—

1134 Q.—SRI S. VEMAYYA :—Will the Hon. the Minister for Agriculture be pleased to state—

(a) the number of private dairies now in the State districtwar ; and

* Printed as Appendix III on page 492 infra.

** (Printed at Pages 4-3 infra.)

28th March 1956]

(b) the subsidy granted to them in 1955-56 ?

21—1134—

A.—(a) There are no private dairies in this State

(b) Does not arise

## II HALF-HOUR DEBATE—RE LAPSE OF LOANS AND SUBSIDIES RECEIVED FROM THE CENTRAL GOVERNMENT.

MR. SPEAKER :—Sri Vavilala Gopalakrishnayya wants half—hour debate on the Unstarred Question No. 575 regarding the lapse of loans and subsidies from the Central Government from 1st October 1953 to 31st March 1954 What more information does the Hon Member want ? He has got all the information in the answer The reasons for the lapse of loans and grants are given to each item of lapse. The Government have furnished all the information.

SRI VAVILALA GOPALAKRISHNAYYA .—ఇది Government leve లో జరుగలేదు, district level లో జరిగింది. District levelలో delay ఎందుకు జరిగిందో చర్చిస్తే మాకూ, ప్రభుత్వానికి ఉపయోగం ఉంటుంది. కారణంకూడా తెలుస్తుంది.

MR. SPEAKER .—I think there are four or five items of lapses and Government have given very good reasons for the same.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—The lapses amount to thirty lakhs.

MR. SPEAKER :—There are reasons given for every item of lapse.

THE HON. DR. B. GOPALA REDDI :—ఇది గత సంవత్సరానికి సంబంధించినది.

If he asks about this year, and I shall give the information.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ఈ సంవత్సరం జరిగినదయితే వచ్చే సంవత్సరం వస్తుంది. వచ్చే సంవత్సరానికి ఈ సంవత్సరం back number అవుతుంది. కనుక ఒక principle ను ఏర్పర్చుకుని మనం చర్చిస్తే బాగుంటుంది. Time ఉంటే ఈ విషయం చర్చించవచ్చును.

[28th March 1956

MR SPEAKER .—Where is the time ? We had a hell of time when we met last in the afternoon.

## III. GOVERNMENT MOTION.

*Motion under rule* 129 (4) *of Assembly* Rules.

THE HON DR B GOPALA REDDI:—Sir, I beg to move

" That sub-rule (4) of Rule 129 suspended and the Speaker do proceed to put every question necessary to dispose of all outstanding matters in connection with the Demands for Grants at 1 p m. to-day."

మన శాసనసభా సమావేశము మామూలుగ 11 గంటలనుండి 5 గంటలవరకు జరగడంచేత రూల్సులో "at five o'clock all the Demand Should be guillotined" అని ఉంది మనం యిప్పుడు ఉదయానే సమావేశం అవుతున్నాం. కాబట్టి 5 గంటలకు బదులు ఒంటి గంటకే డిమాండ్సుపై ఓటింగు జరగాలని ప్రతిపాదిస్తున్నాను.

The motion was put and carried.

[*Note* :—An *asterisk at the commencement of a speech indicates revision by the Member ]

## IV BUDGET FOR THE YEAR 1956-57.

## VOTING OF DEMANDS FOR GRANTS—(contd).

## DEMAND XX—CO-OPERATION.

THE HON. SRI D SANJIVAYYA .—Mr. Speaker, Sir, on the recommendation of the Governor I beg to move :—

" That Government be granted a sum not exceeding Rs. 77,25,300 under Demand XX—Co operation "

సహకారపద్దు అంటే, 20వ నెంబరు పద్దు క్రింద 77,27,800 రూపాయలు మంజూరు చేయవలసిందిగా నేను ప్రతిపాదిస్తున్నాను. ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఆఖరుదశలో ఉన్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక April 1 వ తారీఖునుంచి ఆరంభమాతున్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సహకారోద్యమానికి సంబంధించి వంతవరకు వివిధరీతుల ప్రయత్నాలు సలిపి అనుకొన్న రీతిగా అన్ని విషయాలు ఖర్చుచేయబడినాయి. అయినా ప్రథమ పంచవర్ష ప్రణాళికలో సాధించడానికిగాను ఏర్పాటు చేసుకొన్నటువంటి పనులను అనుకున్నంతగా సాధించలేకపోయినందుకు చాల విచారంగా ఉన్నది. మనం ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికి అప్పుడు

ఉన్నటువంటి కష్టాలవల్ల, ఇబ్బందులవల్ల, ఇక్కట్లువల్ల కొన్నిటిని సాధించలేక పోయినాము. కాని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రధానంగా ప్రభుత్వంవారు తాము తలపెట్టినటువంటి కార్యక్రమాన్ని అమలుజరిపేందుకుగాను Reserve Bank వారు rural credit survey నిమిత్తమై ఒక సంఘాన్ని ఏర్పాటు చేసినారు. వారు report నొక దానిని ప్రభుత్వానికి అందజేసినారు. అందులో ఉన్నటువంటి సిఫార్సులను ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో అమలుపరచడమే ఈ శాఖయొక్క ముఖ్యోద్దేశ్యము. All India Rural Credit Survey వారి Report ను పరిశీలించే నిమిత్తము వివిధ రాష్ట్రాలనుంచి ఈ శాఖను నిర్వహించేటటువంటి మంత్రుల సమావేశము ఢిల్లీలో జరిగింది. ఆ సమావేశంలో ఈ సిఫార్సులను అమలుజరపడానికి ముందు ఒక pilot scheme ను ప్రారంభించి దాని ద్వారా పనిచేస్తే బాగుంటుందేమోనని వారు అనుకొన్నారు. ఆ ప్రకారం మన రాష్ట్రంలో 3 జిల్లాలలో ఈ pilot scheme లను ప్రారంభం చేస్తున్నారు. కర్నూలు జిల్లాలలో ఆదోని, ఆలూరు, పత్తికొండ, ఈ 3 తాలూకాలు చేర్చి ఒక block గాను, West Godavari లో ఏలూరు, తాడేపల్లిగూడెం చేర్చి ఒక block గాను, విశాఖపట్టణంలో అనకాపల్లి, ఎలమంచితాలూకాలు చేర్చి ఒక block గాను ఏర్పాటుచేస్తున్నాము. ఈ ప్రణాళికలో pilot scheme ల క్రింద large scale credit societies అనేవి దాదాపు 80 అంటే కర్నూలుజిల్లాలో 23, పశ్చిమగోదావరి జిల్లాలో 33, విశాఖపట్టణం జిల్లాలో 23, ఏర్పాటుచేశారు. వానికి కావలసినటువంటి ధనసహాయము అంతాకూడా రాష్ట్రప్రభుత్వము, కేంద్ర ప్రభుత్వము, రిజర్వుబ్యాంకు ఇవ్వవలసి ఉన్నది. ఇండియాప్రభుత్వంవారు ఇప్పటి కప్పుడే 10 లక్షల 73 వేల రూపాయలు మంజూరుచేసినారు. Reserve Bank వారు 10 లక్షల 67 వేలరూపాయలు ఇవ్వవలెనని వ్రాసినాము. ఇంకా అక్కడ నుంచి ఏమి జవాబురాలేదు. రాష్ట్రప్రభుత్వం అప్పులరూపంగా 24.18 లక్షలు, 2.35 లక్షలు సబ్సిడీగాను, share capital కు కొంత ఇవ్వవలసి ఉన్నది. ఈ scheme క్రింద marketing societies నుకూడా ఏర్పాటుచేయవలసి ఉన్నది. కర్నూలుజిల్లాలో 2, West Godavari జిల్లాలో 3, విశాఖపట్టణంలో 2, ఏర్పాటు చేయుచున్నాము భారతప్రభుత్వము త్వరలోనే ఒక చట్టాన్ని తీసుకురావడానికి ప్రయత్నంచేస్తున్నది. National Co-operative Development Board, Central Ware Houseing Corporation, State Ware Housing Corporation అనేటటువంటివి ఏర్పాటుచేయడానికి ఆ చట్టంద్వారా అధికారాలు ఇవ్వబడతాయి. 1956-57 సంవత్సరంలో ఆంధ్రరాష్ట్రంలో State Ware Housing Corporation ఏర్పాటుచేయడానికి ప్రభుత్వం ఉద్దేశిస్తున్నది.

Sri D. Sanjivayya] [26th March 1956

దీనిని 30 లక్షలతో ప్రారంభిస్తున్నాము. ఈ 30 లక్షలలో 15 లక్షలరూపాయలు Central Corporation నుంచి వస్తున్నది. 15 లక్షలరూపాయలు రాష్ట్రప్రభుత్వము ఇస్తున్నది ఇది చాల ముఖ్యమైనటువంటి pilot scheme. దీనిని మనం విజయవంతంగా కొనసాగించినట్లయితే రాష్ట్రం మొత్తంమీద ఇటువంటి ప్రణాళికలను అమలుపరచడానికి అవకాశం ఉంటుంది. దేశంలో సహకారోద్యమంలో పనిచేస్తున్నటువంటి ప్రతివారు, ముఖ్యంగా శాసనసభ్యులు, ప్రజాప్రతినిధులు ఈ విషయంలో సానుభూతిచూపి వివిధరీతుల సహాయముచేసినట్లయితే ఈ ప్రణాళికను దిగ్విజయంగా కొనసాగించడానికి అవకాశం ఉంటుంది. ఇది యావత్తురాష్ట్రానికి విస్తరింపజేయడానికి విశేష అవకాశాలు ఉంటాయి. దేశంలో మొట్టమొదటగా ఈ సహకారసంస్థ ఎట్లా ప్రారంభించబడింది, ఈ ఉద్యమం ఎట్లా ప్రబలింది అనేటటువంటివిషయాన్ని నేను ఇప్పుడుచెప్పడం సమంజసం కాదేమోనని భావిస్తున్నాను. ఇక్కడ ఉండేటటువంటి శాసనసభ్యులకే కాకుండా, రాష్ట్రంలో ఉండేటటువంటి పెద్దలు చాలమందికి సహకార ఉద్యమంయొక్క ప్రధానలక్ష్యాలు, ఇది ఏవిధంగా పనిచేస్తున్నదనే సంగతి తెలిసినటువంటి విషయం. ఈనాడు 6542 Agricultural Credit Societies ఉన్నాయి 15 Central Banks ఉన్నాయి. వీటన్నింటికి డబ్బు ఇచ్చేందుకు ఒక State Bank ఉన్నది. వీటన్నిటిని short term credit అంటారు. అంటే సంవత్సరము, 15 మాసాలలోగా వాటివల్ల పొందిన అప్పులను వాపసు ఇవ్వవలసి ఉంటుంది. ముఖ్యంగా రైతులే society ల నుంచి అప్పులు తీసుకొంటున్నారు. వర్షాభావంవల్ల పండకపోయినట్లయితే రైతులు చాల కష్టపడవలసి ఉంటుందిగనక short term loan అనేటటువంటిదికూడా ఏర్పాటుచేశారు. ఈ అప్పులు దాదాపు 3 సంవత్సరాలు, 5 సంవత్సరాలలో తీర్చడానికి అవకాశం ఉంటుంది. ఇంతేకాక దీనివల్ల దీర్ఘవాయిదాలరూపంలో అప్పులు లభిస్తున్నవి.

Land Mortgage Banks కూడా ఉన్నాయి. రాష్ట్రంలో Primary Land Mortgage Banks 56 ఉన్నాయి. Central Land Mortgage Bank ఒకటి ఉన్నది. వీటిద్వారా విశేషంగా అప్పులు లభిస్తున్నాయి. కాని అందులో చాలా ఆలస్యం జరుగుతోందనే విషయం అనాదినుంచి అందరు అనుకొన్న విషయము ఇటీవల ఒకనెల, నెల 15 రోజులక్రితం ఒక సమావేశం ఏర్పాటు చేసినారు. ఆ సమావేశంలో రాయలసీమలో ఉండేటటువంటి Primary Land Mortgage Banks ప్రతినిధులు నెల్లూరు, గుంటూరువారు. శాసనసభ్యులలో కూడా కొంతమంది పాల్గొన్నారు. ఈ సమావేశంలో ఈ ఆలస్యం జరుగకుండా, జాప్యం జరుగకుండా ఏపద్ధతులు అవలంభించవలసి ఉంటుంది, ఎటు

వంటిచర్య తీసుకోవలసి ఉంటుందనే విషయాలు సమగ్రంగా చర్చించారు. అందులో కొన్ని సలహాలను రిజిస్ట్రారుకు ఇచ్చి ఉన్నాము. వీటన్నింటిని పాటించినట్లయితే అప్పులను మంజూరు చేయడంలో జరిగేటటువంటి ఆలస్యము జరుగకుండా పోతుందని త్వరగా అప్పులు లభిస్తాయని ఆశిస్తున్నాను. అంతేకాకుండా వర్షముమీద ఆధారపడి సేద్యం కొనసాగిస్తునటువంటి పొలాలమీద అప్పులు తీసుకొనేటప్పుడు ఒకవిధంగాను, నీటిపారుదల వసతులు ఉన్నటువంటి పొలాలమీద అప్పులు తీసుకొన్నప్పుడు ఇంకొకవిధంగానూ ఏర్పాటు చేశారు. 1939 వ సంవత్సరానికి అంటే యుద్ధానికి పూర్వం పొలాలకు ఉన్నటువంటి విలువ ప్రకారం dry lands కు 33%, wet lands కు 50% అని ఏర్పాటుచేసిఉన్నది. "పొలలాకు ఖరీదుకడుతున్నారు. నీటి పారుదల లేనటువంటి పొలాలైతే ఖరీదు తక్కువగా ఉంటుంది. నీటిపారుదలగలిగిన కృష్ణా గుంటూరుజిల్లాలలో ఎకరం 5000 రూపాయిలు ఖరీదుచేసే భూములుకూడా ఉన్నాయి. అటువంటప్పుడు ఖరీదు తగ్గితే percentage కూడా తగ్గుతుంది. కాబట్టి dry lands కు భేదంఉండకూడదనే విధంగా" నేను ఆ సమావేశంలోనే వారికి సూచించాను. సభ్యులంతా కూడా ఒప్పుకొన్నారు. Registrar గారుకూడా ఆ rules ను మార్చి dry lands కూడా, 50% వరకు అప్పులు లభించేటటువంటి విధంగా చేస్తామని చెప్పారు.

Wholesale stores కొన్ని ఉన్నాయి. అవి controls ఉన్నకాలంలో లాభాలు బాగా సంపాదించుకొన్నాయి. ఇప్పుడు controles పోయిన తరువాత వీటికి విశేషంగా పనిలేదు. ఆ కారణంచేత వీటిని Marketing Federation గా మార్చాలనే ఆలోచనఉన్నది. కొన్ని అప్పుడే మార్చబడినాయి. కొన్ని మార్పు దశలో ఉన్నాయి. కొన్ని జిల్లాలలో 174 Marketing Societies ఉన్నాయి. వీటిని రద్దుచేసి వాటిస్థానే shandy centres లోను, తాలూకా Headquarters లోను కొన్ని Marketing Societies ను దాదాపు 110 ఏర్పాటుచేసి వీటన్నింటిని Marketing Federation గా రాష్ట్రస్థాయిలో ఏర్పాటుచేయాలని అనుకొంటున్నాము. వీటికి పనికల్పించడం ఎలాగా అనేటటువంటి విషయాన్ని బాగా ఆలోచించి tender forms ద్వారా సరఫరా చేయబడుతూ ఉండేటటువంటి ఎరువులను Co-operative Societies ద్వారానే సరఫరా చేయవలసిఉంటుందని ప్రభుత్వం నిర్ణయంతీసుకొన్నది. ఇది చాలపెద్ద నిర్ణయమని నేను భావిస్తున్నాను. 1956-57 సంవత్సరంలో లక్షటన్నులు ఎరువులు సరఫరా చేయవలసిఉంటుంది. ఒకొక్కటన్నుకు ఖర్చులన్నీపోయినా దాదాపు 40 రూపాయలు లాభంఉన్నదని చెప్పుతున్నారు కనీసం 25 రూపాయలైనా లాభముఉంటుందని నేను భావిస్తు

Sri D. Sanjivayya] [28th March 1956

న్నాను. లక్షటన్నులమీద 25 లక్షలరూపాయలు ఈ Co-operative సంస్థలకు లాభం వస్తుంది. ఈ సంస్థలన్నీ బాగుపడడానికి, పనిచేయడానికి అవకాశంఉంటుందని నేను అనుకొంటున్నాను. ఇంకొక ప్రధానవిషయం చేనేతవారికి సంబంధించినది. మన చేనేతసేనాని ప్రగడ కోటయ్యగారు ఇక్కడే ఉన్నారు. వారు అస్తమానం చేనేతవారియొక్క శ్రేయస్సు దృష్ట్యా మాట్లాడుతూఉంటారు. ఈనాడు 659 primary Weavers Societies ఉన్నాయి. వీటన్నటినిచేర్చి State Handloom Weavers Society అని ఒకటి ఉన్నది. ఆంధ్రలో 3 లక్షల 9 వేలమగ్గాలు ఉన్నాయని అంచనా వేయబడుతూఉంది. అందులో Co-operative సంస్థలలో దాదాపు లక్షకుపైగా ఉన్నాయని అనుకొంటున్నాను.

Co-operative సంస్థలలో 23 వేలు మగ్గాలుఉన్నాయి వీరికి Central Bank లో నుంచి సరిగా అప్పులు ఇవ్వడంలేదు అనేటటువంటి complaint ఎప్పుడూ మనకు వినబడుతూనే ఉంటుంది. అటువంటిది లేకుండా చేయడానికి పద్ధతి ఏమిటి అని ఆలోచిస్తూ, Central Bank ఈ Weavers Co-operative Societies కు తప్పకుండా సకాలములో అప్పులు ఇవ్వాలి అనేటటువంటి విధముగా వారిని అడుగుతున్నాము. కాని చట్టరీత్యా మీరు తప్పకుండా ఈ Weavers Societies కు అప్పు ఇవ్వవలసిందనిచెప్పే అధికారము ప్రభుత్వానికి లేనటువంటి కారణంచేత ఆ విషయంలో అనుకొన్నంతగా వారికి సహాయం చేయలేక పోతున్నాము అనేభావము ప్రభుత్వానికి కలిగింది. ఆ కారణంచేతనే ప్రగడ కోటయ్యగారు మొదలైన చేనేత పరిశ్రమలో శ్రద్ధవహిస్తున్నటువంటివారు చెప్పిన విధంగా, వీరికి ప్రత్యేకంగా ఒక Finance Corporation ఏర్పాటు చేయాలనేటటువంటిది ప్రభుత్వముయొక్క సంకల్పనగాయున్నది. దీనికి కావలసిన ధన సహాయంకోసం కేంద్రప్రభుత్వానికి వ్రాశాము. వారి Cess fund నుంచి కొంత డబ్బు ఇవ్వవలసిందని. వారివద్దనుంచి, ఉత్తరువురాగానే వీరికి ప్రత్యేకంగా ఒక ఆర్థికసంస్థ ఏర్పడుతుందని నేను భావిస్తున్నాను:

తరువాత కొంత చాకధంలలో నూలు సరఫరా చేసేటటువంటి విధానముకూడ ప్రభుత్వము పరిశీలించింది. మద్రాసురాష్ట్రంలో ఉండినప్పుడే, సహకార పద్ధతుల మీద నూలును ఉత్పత్తిచెసేటటువంటి ఒక కర్మాగారాన్ని గుంతకల్లులో ఏర్పాటు చేశాము. అది 11 వేల స్పిండిల్స్‌తో పనిచేస్తున్నది ఇంకొక 5 వేల స్పిండిల్స్ ఎక్కువ చేయాలని ప్రభుత్వము అనుకొంటున్నది. దానికిగాను దాదాపు 10 వేల రూపాయలు కేంద్రప్రభుత్వాన్ని అప్పుగా ఇవ్వవలసిందని అడిగాము. అది తప్పకుండా వస్తుందని ఆశిస్తున్నాము. అంతే

కాకుండా, ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తాడిపత్రి అనేటటువంటి పట్టణములో, ఇంకొక Spinning Mill ఏర్పాటుచేయవలెనని ప్రయత్నాలు జరుగుతున్నాయి. అతిత్వరగా ఆ ప్రయత్నాలు పూర్తిఅవుతాయని ఆశిస్తున్నాను. అంతేకాకుండా, ఇప్పుడు ఏటికొప్పాక అనే గ్రామంలో చక్కెర తయారుచేసేటటువంటి factory ఉన్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దాదాపు 5,6 చక్కెర factories ఏర్పాటుచేయవలెనని అనుకొంటున్నాము. అవి. హిందూపురము, చిత్తూరు, పాలకొల్లు, గోపవరము, ఆముదాలవలస అనేఊర్లలో ఏర్పాటుచేయవలెనని అనుకొంటున్నాము. గుంటూరుజిల్లాలో చుండూరు అనే గ్రామంలోకూడ ఒకటి ఏర్పాటుచేయవలెనని అక్కడ చెరుకు పండించేటటువంటి రైతులందరుకూడ కోరుతున్నారు. వారు అమితమైనటువంటి శ్రద్ధచూపుతున్నారు. ఆ విషయములో కూడ భారతప్రభుత్వానికి వ్రాశాము. కాని ప్రస్తుతము, ఈ అయిదుమాత్రము ఖచ్చితముగా వస్తాయి అనేటటువంటి ఆశ మాకు ఉన్నది.

తరువాత సహకారపద్ధతులమీద గృహనిర్మాణముకూడా జరుగుతున్నది. దాదాపు 114 సొసైటీలు పెద్దపెద్ద పట్టణాలలోను, మునిసిపాలిటీలలోను, మేజర్ పంచాయితీలలోను ఉన్నాయి. Rural Housing Societies అనేవి చిన్నచిన్న గ్రామాలలో 26 ఉన్నాయి. ఇంతేకాకుండా Low Income Group Housing Scheme అనేటటువంటిది భారతప్రభుత్వము ప్రతిపాదించింది. ఆ Scheme కూడ ఈ సహకార గృహనిర్మాణసంస్థలద్వారానే మేము నిర్వహిస్తున్నాము. 50 లక్షల రూపాయలకుపైగా ఈ సంవత్సరానికి భారతప్రభుత్వము మనకు ఇచ్చింది అదంతా కూడ 35 మునిసిపాలిటీలకు, ఆరు పంచాయితీబోర్డులకు అక్కడ ఉన్నటువంటి సహకార గృహనిర్మాణసంస్థలకు ఇచ్చివున్నాము. 31 వ తేదీలోగా ఇదంతా ఖర్చు అవుతుందని మేము ఆశిస్తున్నాము ఇక చాలా బీదవాళ్లు, హరిజనులు, వెనుకబడిన జాతులవాళ్లు, మాజీగీతపనివాళ్లు వీరందరికికూడ వృత్తులుకల్పించే జీవనోపాధి ఏర్పాటుచేసేనిమిత్తము సహకారసంస్థలద్వారా విశేషంగా కృషి జరుగుతున్నది వీనికి Land Colonization Societies అని కొన్ని ఉన్నాయి. 18 Civilians కు ఉన్నాయి. 7 మాజీసైనికులకు ఉన్నాయి. Tenants and Field Labour Co-operative Societies 899 ఉన్నాయి. వీటికి పొలాలను ఏర్పాటుచేస్తున్నాము. కాని ఈ project affected lands అనేటివి assign చేయకూడదు అనేటటువంటి ప్రభుత్వవిధానంవల్ల కొన్ని అనుకొన్నటువంటి సొసైటీలు ఏర్పాటు చేయలేక పోయినాము. ఇంకా కొంతకాలము పోయి తరువాత, మాకు స్పష్టంగా ఏవీ పొలాలు project affected lands క్రింద వస్తాయి అనేది తెలిసినతరువాత

Sri D. Sanjivayya] [28th March 1956

వాటిని మినహాయించి, మిగతాచోట్ల ఈ Field Labour Co-operative Societies, Land Colonization Societies, ఇవన్నీకూడ ఏర్పాటుచేయవలెనని అనుకొంటున్నాము. అంతేకాదు. ఈ లంకభూములుకూడ ఈ Field Labour Co-operative Societies కు ఇస్తున్నాము. అనాదిగా ఇది జరుగుతున్నటువంటి విషయము. ఈ Field Labour Co-operative సొసైటీలవారు దాదాపు 25 వేల ఎకరాల లంకభూములను చేసుకొంటున్నారు. ఇందులో 10 వేల ఎకరాలేమో మిగతా రైతులకు వేలముపెట్టడంద్వారా ఇవ్వబడింది. ముఖ్యంగా రైతులకు, వాళ్ళపశువుల మేతకోసం కొంతే ఏర్పాటుచేస్తే బాగుంటుందని, 2/3 auction చేయకుండా Field Labour Co-operative Societies కో లేకపోతే Tenants Co-operative Societies కో ఇవ్వాలని, 1/3 ఏమో auction వేసి పశుగ్రాసంకొరకు రైతులకు ఇవ్వాలని ప్రభుత్వము నిర్ణయించింది.

అంతేకాదు. దేవాలయాలకు విశేషంగా భూములున్నాయి. కొన్ని కొన్ని దేవాలయాలకు వందలాది, వేలాది ఎకరాల పొలాలు ఉన్నాయి. కొంతమంది ఇదివరకే వాళ్లకు రెండు, మూడువేల ఎకరాలుఉన్నాకూడ మళ్ళీ ఈదేవాలయాలకు సంబంధించిన పొలాలు, 2 వందలు, 3 వందలు, వెయ్యిఎకరాలు ఈవిధంగా తీసుకొని సాగుచేస్తూఉంటే ఇదంతా ప్రభుత్వము పరిశీలించి, బీదవాళ్లు, పొలములేనటువంటివారు, వృత్తిలేనటువంటివారు, చాలా దీనావస్థలో ఉండేటటువంటివారు, ఇటువంటివారికి వృత్తికల్పిస్తే మంచిదని భావించి, ఆ పొలాలకుకూడా ఈ Tenants Co-operative Societies కు, Field Labour Co-operative Societies కు ఇవ్వాలని ప్రభుత్వము ఉత్తరువులు జారీచేసింది. అయితే అందులో, అయిదువేల రూపాయలకుపైగా ఆదాయముకలిగినటువంటి దేవాదాయాలకు సంబంధించినటువంటి పొలాలన్నీ Co-operative Societies కు ఇవ్వాలని అన్నారు. ఎందుకంటే, అయిదువేలకు లోపుగా ఆదాయము ఉన్నట్లయితే, ఆ Temple చాలా చిన్నదనిన్నీ దానికి వచ్చేటటువంటి ఆదాయములో మళ్ళీ average rate తో lease కు ఇచ్చినట్లయితే, దాని ఆదాయము తగ్గి అక్కడ జరిగేటటువంటి పూజలు, పునస్కారాలకు లోపము కలుగుతుందేమో ననే భావముచేత ఈవిధంగా ఏర్పాటు చేసినాము. అయినా, అనేకసార్లు ఇక్కడ ఉన్నటువంటి సభ్యులు తెలియజేసినటువంటి విషయాలను, ఇంకా నేను బయటికిపోయినప్పుడు అక్కడ ఉన్న సొసైటీవారు తెలియజేసినటువంటి విషయాలను పరిశీలించి ఈ అయిదువేలను ఇంకా కొంచెము తగ్గించాలనే ఆలోచనకూడ ప్రభుత్వము ఆలోచిస్తున్నది. త్వరలోనే ఈ విషయములో ఒక నిర్ణయానికి వస్తాము.

తరువాత, ఇంకా ఈ బీదవాళ్ళకు Forest Coupe Societies అనేవి ఏర్పాటుచేస్తున్నాము. ఈ Societies అనేకచోట్ల ఉన్నాయి. ఇంకా కొత్త కొత్తచోట్ల ఏర్పాటుచేస్తాము. అయితే ఈ Forest Coupe Societies ఉన్న చోట, Forest Officers auction వేయకుండా, three years average rate కే వాళ్లకు ఇవ్వాలని ఉత్తరువుకూడ ఉన్నది. కొన్ని సందర్భాలలో ఆ ఉత్తరువును ధిక్కరించి Forest Officers auction వేసినారు. Society వాళ్లు ఆ G. O. చూపించి Forest Officers ను బ్రతిమాలినాకూడ, ఆ ఉత్తరువును వారు ధిక్కరించి వేలమువేసినారు. వీటిని confirm చేయకుండా orders ఇవ్వండి అని సొసైటీవాళ్లు చెప్పుకుంటే, ఎన్నోసార్లు మేము stay orders ఇచ్చి మళ్ళీ సొసైటీలకే ఇప్పించినటువంటి సందర్భాలు ఉన్నాయి. అంతేకాదు. కొన్ని చోట్ల ఇంకా సొసైటీలు ఏర్పాటుచేసుకొంటున్నాము, ఫలానా తేదీ auction కాబోతున్నది, మా సొసైటీ రిజిస్టరు అయ్యేవరకు auction నిలబెట్టండి అంటే, అటువంటి సందర్భాలలోకూడ, ఆ auction ను stay చేసి, ఆ Societies ను వారము 10 రోజులలో register చేయించి, ఆ సొసైటీలకే ఇప్పించినటువంటి సందర్భాలుకూడ అనేకము ఉన్నాయి.

Sri PRAGADA KOTIAH :—ఈ concession వారము రోజుల క్రిందట withdraw చేసినారట కదండి.

The Hon. Sri D. SANJIVAYYA :—That is not anything of the kind I know of. ఈ విధంగా వారికి చాలా సహాయం చేస్తున్నాము. కాని ఈ concession కూడ withdraw చేయడానికి అవకాశాలు ఉన్నాయని నేను ప్రగడ కోటయ్యగారికి మనవి చేస్తున్నాను. ఎందుకంటె ఎవరో ఒక పెద్ద contractor తనకు రాకుండా పోతుందేమోనని, తన క్రింద పనిచేస్తూ ఉండేటటువంటి పదిమంది కూలీలను ప్రోగుచేసుకొని ఒక సొసైటీని ఏర్పాటుచేసి వాళ్లకు మామూలు కూలి ఇచ్చి దాంట్లో వచ్చినటువంటి అధిక లాభాలు అనుభవించే టటువంటి సందర్భాలు ఉంటే, అటువంటి చోట ఈ concessions ఇవ్వకూడదని మేము ఆలోచిస్తున్నాము. కాని ఈ సొసైటీలు సక్రమంగా పనిచేసేటట్లు చర్య తీసుకొని, ఈ coupe లు ఆ సొసైటీలకే ఇవ్వడము లట్టైస్తున్నది. ఎక్కడైనా ఎవరైనా దుర్వినియోగము చేసినట్లయితే అక్కడ చర్య తీసుకొంటామని హామి ఇస్తున్నాను. తరువాత వీరికి Labour Contract Societies అనేవి కూడ ఏర్పాటు చేస్తున్నాము. చిన్నచిన్న పనులు 2,500 రూపాయలు కిమ్మత్తు కలిగి నటువంటి contracts, టెండర్లు call for చేయకుండా ఇవ్వాలని ముందు ఉత్తరువు

Sri D. Sanjivayya] [28th March 1956

ఉండినది. అయితే, 2,500 రూపాయలకు లోపుగా ఉండే పనులు చాలా తక్కువగా ఉంటాయి కాబట్టి దీన్ని పదివేలకో, 20 వేలకో పెంచండి అని చాలా మంది సూచించారు. ఆ కారణంచేత ఇప్పుడు అది పదివేల రూపాయలకు పెంచినాము. ఇంకా పెంచడానికికూడా ఆలోచిస్తున్నాము. తరువాత వీటికి Milk Supply Societies కొన్ని ఏర్పాటు చేస్తున్నాము. ఇవి మన రాష్ట్రంలో 230 ఉన్నాయి. Milk Unions 19 ఉన్నాయి. అంతేకాకుండా, విశేషంగా పాలను ఉత్పత్తి చేయడానికి కర్నూలులోను, గుంటూరులోను, విశాఖపట్టణంలోను కూడ intensive Milk Supply Schemes అనేటటువంటివి ఏర్పాటుచేశాము. అక్కడ pasterisation plant, అంటే వాటిని నిలువచేసేందుకు, సహాయము జరుగుతున్నది. తరువాత హరిజనులకు, backward classes కు, కలిసి 17,289 సొసైటీలు ఉన్నాయి. అంతేకాకుండా చిన్నచిన్న వృత్తులు చేసుకొనే వారికి Cottage Industrial Co-operative Societies చాలా ఏర్పాటు చేసినాము. Fishermen Co-operative సొసైటీలుకూడ 192 ఉన్నాయి. Motor Transport Societies నాలుగు ఉన్నాయి. Palm Jaggery Societies 690 ఉన్నాయి ఈ విధంగా వెనుకబడిన జాతులకు, హరిజనులకు వృత్తులు కల్పించే నిమిత్తము అనేకవిధాలుగా మేము సహకార సంఘాలు ఏర్పాటు చేసినాము. ఈ సంఘాలు సక్రమంగా పనిచేస్తున్నాయని నేను ఆశిస్తున్నాను. సక్రమంగా పనిచేసినట్లయితే, ఆయా వృత్తులలో పనిచేసే వారికి వృత్తులు కల్పించినవారు అవడమే కాకుండా వారికి అనేక విధాలుగా లాభము ఉంటుందని కూడ నేను ఆశిస్తున్నాను.

ముఖ్యంగా Cottage Industrial Societies యీ రాష్ట్రములో ఎటువంటివి ఉన్నవి అనే దానికి నేను ఉదాహరణకు ఒకటి, రెండు సొసైటీల పేర్లు చెబితే సభ్యులకు ఆనగాహన అవుతుంది ఇందులో Carpet Weavers Societies, Kambli and Blanket Weavers Societies, Handloom Weavers Co-operative Societies, Hat Weavers Societies, Tape Weavers Societies, Lace workers Societies, Coir Workers societies, Leather Workers Societies, Basket Makers Societies, Pot Makers Societies, Toy Makers Societies, Cart Makers Societies, Brick Makers Societies, Stone Carvers Societies, Trailers Societies Metal Workers Societies, Women Co-operative Societies, వగైరాలు ఉన్నవి. ఇవి అన్నీగూడ రాష్ట్రములో పని చేస్తున్నవి. ఒక్కొక్క యీ industry లకు సంబంధించినవారు, వారిలో వారికి

28th March 1956] [Sri D Sanjivayya

పనులు కల్పించుకోవడమే కాకుండా, వారి కుటుంబాలకు కూడ ఆదాయములు ఏవో రూపములో చేకూర్చుకుంటున్నారు. ఆ కారణముచేత అనేక రకాలైన సొసైటీలు ప్రారంభించి యీ దేశములో ధన సంపత్తును అభివృద్ధిలోనికి తీసుకొని రావటానికి ప్రభుత్వం కృషిచేస్తున్నది. కాబట్టి యీ Demand మీద సభ్యులందరు సమగ్రంగా చర్చించి ఏవైనా సలహాలుయిస్తే, ప్రభుత్వము వాటిని పరిశీలించి తగిన చర్యలు తీసుకోటానికి, సంసిద్ధముగా ఉన్నది. అందువల్ల ఈ డిమాండును ప్యాసు చేయమని కోరుతున్నాను.

Mr. SPEAKER —Motion moved :

"That Government be granted a sum not exceeding Rs 77,25,300 under Demand XX—Co-operation.

(Cut motion No. 488 was not allowed to be moved as the Speaker ruled it out on the ground that Government cannot be censured for not bringing a particular legislation.)

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I beg to move .

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100

(కో-ఆపరేటివ్ సిబ్బందికి ఎన్. జి. ఓ లకిచ్చే వైద్య విద్యా సౌకర్యాలు యివ్వవలెనని )

Sri P. SATYANARAYANA —Sir, I beg to move :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

(చేనేత ప్రాథమిక సొసయిటీలకు వినియోగపడని సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకుల మీద సొసైటీలను ఆధారపెట్టే విధానం మాని చేనేత సొసయిటీలకు ప్రత్యేక ఎపెక్సు బ్యాంకు నెలకొల్పవలసిన అవసరాన్ని ప్రభుత్వం దృష్టికి తెచ్చుటకు )

Sri P. SATYANARAYANA :--Sir, I beg to move :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

(చేనేత సొసయిటీలలో వడ్డీ 1 కి రూ. 0-4- కనీసం వేతనంగా నిర్ణయించవలసిన అవసరాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చుటకు,)

SRI B RAMA REDDI :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

(To criticise the Government for not changing the procedure to expedite payment of loans to the applicants in Land Mortgage Banks )

SRI G. NAGESWARA RAO :—I beg to move :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

(యఫ్. యల్. సి. సొసైటీలకు ఏవిధంగాను క్రెడిట్ సౌకర్యాలు లేక పోవడమువల్ల సొసయిటీలు అనేక యిబ్బందులు పడుచున్నాయి. యీ విషయములో ప్రభుత్వము ఒక ప్రత్యేక కో-ఆపరేటివ్ బాంకును స్థాపించే అవసరాన్ని గుర్తించక పోవడము గురించి చర్చించేందుకు.)

MR. SPEAKER :—The main Demand as well as the cut motions are now before the House for discussion. Sri Satya-narayana will commence the debate.

SRI P. SATYANARAYANA :—అధ్యక్షా, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో Co-operative ఉద్యమముయొక్క అభివృద్ధి తగినంతగా ఆంధ్ర దేశములో జరగడములేదు. Planning Commission వారు యిచ్చిన directives ను గూడ పాటించి ప్రభుత్వము అయినను పటుతరమైన చర్యలు తీసుకోవడములేదు. కాబట్టి యీ విషయములో మాత్రము ప్రభుత్వాన్ని అభినందించటానికి అవకాశము లేదు. కాని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యిదివరకటికంటె ఎక్కువ శ్రద్ధగాను, పట్టుదలగాను పనిచేయటానికి ప్రభుత్వం సంకల్పించి ఉన్నది. ఈ విషయములో ప్రభుత్వము ప్రకటించిన ప్రకటనలనుబట్టి కొంతవరకైనా దేశము అభివృద్ధి అవుతుందేమోనని ఆశిద్దాము. ఇటీవలనే కేంద్ర ప్రభుత్వం ముఖ్యంగా గ్రామీణప్రాంతాలలో Co-operative ఉద్యమము యొక్క వ్యాప్తిని విస్తరింపచేయాలని, ఆసియా ఖండము అంతటిలోనూ, చైనా దేశములోను కో-ఆపరేటివ్ ఉద్యమము ఏ విధముగా విజృంభించుచున్నదిన్నీ గమనించి మన దేశములోగూడ అదేమాదిరి విజృంభింపచేయటానికి ఒక కమిటీని చైనాదేశమునకు పంపించడము జరిగింది. వారు చైనాదేశము వెళ్లివచ్చినారు తమ రిపోర్టును కేంద్రప్రభుత్వానికి అందజేసిన తరువాత మనదేశములో

గూడ ఆదేమాదిరి అవకాశములు కల్పించటానికి ప్రభుత్వము చర్యలు తీసుకుంటే ప్రభుత్వాన్ని అభినందించటానికి వీలుఅవుతుంది. ఇప్పుడు మంత్రిగారు చెప్పిన అంశములలో ammonia sulphate న్నూ, super phosphate న్నూ కో-ఆపరేటివ్ రంగము ద్వారా distribute చేయుటానికి వీలుగా చర్యలు తీసుకుంటున్నదని చెప్పారు. దీనినిబట్టి అయినా, కొంతవరకు ఖర్చులు తగిలినప్పటికిని, కో-ఆపరేటివ్ రంగము బలపడటానికి అవకాశము ఉంటుంది గనుక ప్రభుత్వాన్ని కొంతవరకైనా అభినందించటానికి మాకు అభ్యంతరములేదు.

ఇకపోతే రెండవ విషయము ఉన్నది. గ్రామాలలో కో-ఆపరేటివ్ వ్యవస్థ, యితర అన్ని వ్యవస్థలకంటెగూడ బలపడటానికి అవకాశము ఉన్నది. Individual sector, Private sector కంటె, లేక National sector కంటెగూడ, కో-ఆపరేటివ్ సెక్టరును అభివృద్ధి చేయడము మాత్రమే కనబడుతున్నది. ఈ విధముగా ప్రభుత్వము చేయడమువల్ల గ్రామీణ వ్యవస్థ అభివృద్ధికి రావటానికి తగిన అవకాశములు ఉంటాయి. కాబట్టి ప్రభుత్వము ఎక్కువ పటుతరమైన చర్యలు తీసుకోవలసి ఉంటుంది. ఇటీవల కేంద్ర ప్రభుత్వము చేనేతవారికి సంవత్సరము ఒకటింటికి 50 లక్షలు పైగా యిస్తున్నది. మనకు ప్రత్యేకముగా ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత యీ ప్రభుత్వము పనులు త్వరత్వరగా జరిపించకపోతే, మనకు యిచ్చిన సొమ్మును వాపసుచేయవలసి వస్తుందేమోనన్న ఆతురతతో, కొంచెము హడావుడిగా పనులు జరిపించటానికి కొన్ని కార్యక్రమాలను వేసుకున్నాము అంత తొందరగా పనులు చేయించటములో గూడ మాకేమీ అభిప్రాయభేదములేదు. కాని వేసుకున్న కార్యక్రమాలయొక్క స్వభావాన్ని మాత్రము మేము ఖండించక తప్పడములేదు. కాని ఏర్పాటు చేసుకున్న కార్యక్రమాలు జరిపించడములో కొన్ని లోపాలు ఉన్నప్పటికినీ, పనులు త్వరగా జరగవలసియున్నవి కనుక అందుకు కొంత margin యివ్వవలెనని అనకోవచ్చును. అయినప్పటికినీ, అందులో ఏమైనా లాభాలువస్తే, అవి గ్రామస్థులకు లభించే plans వేయలేదు దీనికి మా అసమ్మతిని తెలియజేయక తప్పదు. ఉదహరణకు చేనేత Cess Fund అని ఉన్నది. దీనికి Central Godowns System అని ఒకటి పెట్టి, దానిని బాగా extend చేశారు. ఈ godowns మీద ఒక్కొక్కదానికి ఒక్కొక్క Gazetted Officer ను వేశారు. ఆయనకు జీతము అయితేనేమి, T.A. వగైరాలు అయితేనేమి, నెల ఒకటింటికి సుమారు 900 రూపాయలదాకా యిస్తున్నారు. ఈ Gazetted Officer కు వ్యాపారానుభవము ఉంటుందని అనుకోటానికి వీలులేదు. ఇలాంటి వ్యాపారానుభవము లేనివారిని Godowns Officer గా వేస్తే, ఆయనవలన

Sri P. Satyanarayana] [28th March 1956

ఏదోవిధముగా వైటికి పంక్తిచేయటానికి చూస్తాము. ఆయనను ఎంతసేపటికిని నెల వచ్చేటప్పటికి ఏపది లక్షల రూపాయల విలువగలసరకు డిపోలకు distribute చేయడమువరకే చూసుకుంటాడు. వ్యాపారానుభవము లేకపోవడమువల్ల ఎంత సేపటికిని bureaucratic విధానమే ఆయనకు ముందుమాపుగా ఉంటుంది. ఇలాంటి వ్యక్తిత్వము కలిగిన ఆ గజెటెడ్ ఆఫీసరు, godowns లో ఏ మాత్రమైనా స్టాకు నిలవ వుండిపోయినప్పుడు, ఆయనపైన ఉన్న అధికారి ఏమద్రాసులోని హెడ్డాఫీసు stock యింకా release చేయలేదేమని strictures ను pass చేస్తూంటే, ఆ ఒత్తిడికి తట్టుకోలేక, డిపో మేనేజర్లను పిలిపించి, ఆ స్టాకు తీసుకోటానికి వారు యిష్టపడక పోయిననూ వారికి అంటగట్టటానికి మొదలము జరుగుచున్నది. ఏమియూ అర్థంకాకము చెప్పలేనిస్థితిలో ఉన్నటువంటి యీ డిపో మేనేజర్లు, నెత్తిన నిర్బంధంగా రుద్దినసరకును అంతా తీసుకొని పోయి, డిపోలలో పెట్టుకుని సరఫరా చేయడము జరుగుతున్నది. దీనివల్ల అది వరకు డిపోలు సంపాదించుకున్న goodwill కాస్తా నాశనము కావడముతప్ప మరేమీకాదు. పైగా విపరీతమైన overhead charges గూడ డిపో మేనేజర్లే భరించవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. ఈ పరిస్థితిని సర్దుకోడానికి, లాభాలు ఎక్కువగా గడించాలనే ఉద్దేశ్యముతో, ధరలు ఎక్కువ పెంచడము కన్పిస్తున్నది. అందువల్ల ఈ విపరీతమైన ధరలకు తట్టుకోలేక పోతున్నారు. ఇంతేకాకుండా చేనేతవారు Primary Co-operative Societies ద్వారా నేసుకుంటూ ఉంటే, వారికి యిచ్చే వేతనములు తగ్గించి, వారిమీద అనవసరమైనా హంగామా, ఒత్తిడి తేవడము జరుగుతున్నది. చేనేతవారికి వచ్చే కూలీ గిట్టుబాటుకాకపోవడమువల్ల, వారు గిట్టుబాటు ధరలకు అమ్ముకోటానికి ప్రయత్నిస్తున్నప్పుడు, ఆ ధరలు అంతా consumers నెత్తిమీద వేసి రుద్దటము జరుగుతున్నది దీనివల్ల consumers ఏవిధముగా యిబ్బందులకు లోనగుచున్నారో ప్రభుత్వము గమనించవలసి యుంటుంది. కాబట్టి యీ system శుద్ధ పనికిమాలినదని చెప్పవలసి వచ్చింది. ఇప్పుడు దీనిని మద్రాసుప్రభుత్వమువారే తీసుకుంటున్నారు. ఆ ప్రభుత్వము యీ సిస్టము బాగుగాలేదని, యిదివరకే రద్దుచేసుకున్నది. ఇప్పటికే చాలా time జరిగిపోయింది. కాబట్టి యీ ప్రభుత్వముగూడ మద్రాసుప్రభుత్వము మాదిరిగా త్వరలో రద్దుచేసుకుంటే, బాగుంటుంది. ఈ అనవసరమైన overhead charges, మన ప్రజలు భరించలేరు. Consumer మరింత దెబ్బ తింటాడు. కాబట్టి మనకు సొసైటీలు ఎక్కువగా విస్తరణలోకి వచ్చినదికాబట్టి, ప్రభుత్వమునకు అవసరమనుకుంటే, యిప్పుడు ఉంటే Secretary కి తోడుగా ఆయనకు సహాయకులు [illegible] Assistant Secretaries ను, Deputy Secretaries ను

చేసుకుని యీ విషయము ప్రభుత్వము మేనేజిచేస్తే సరిపోతుంది. మద్రాసువారి కంటె మనకు ఎక్కువ వ్యాపారములేదు. వారు ఈ సిస్టముకు ఏనాడో మానివేశారు. మనముగూడ యీ godown system మానివేస్తే బాగా ఉంటుందని నా అభిప్రాయము.

వాస్తవముగా చూస్తే ప్రాథమిక చేనేతసొసైటీల వారి పనులు అడకత్తెరలో పడిపోయినవి. ఒకవైపున planning అంటున్నాము. నూలు ధరలలో speculation బాహాటముగా జరుగుతూనే యున్నది. ఈ నూలు ధర ఎంత మేరకు పెరుగుతూ ఉంటుందో, అంత మేరకు వారికి మజూరికూడ తగ్గిపోతూ ఉంటుంది. ఏమైనప్పటికిని, కనీసము యీ ప్రాథమిక సొసైటీలు అన్నికలిపి, లక్షలు పెట్టుబడి పెట్టి నడిపినను, నెలలో ఉన్న ముప్పైరోజులుగూడ వారికి పని ఉన్నది అని చెప్పటానికి వీలులేదు. పైగా ప్రభుత్వం బలవంతముగా వారికి కొంత డబ్బు యిచ్చి గుంతకల్లులో ఒక పెద్ద ఫ్యాక్టరీ కట్టించారు. అది ప్రారంభించినను, నూలు సక్రమమైన ధరకు ఇస్తున్నదా అంటే, అదిగూడ కనబడదు. ఆ ఫ్యాక్టరీ అయినా నూలును సక్రమమైన ధరకు యివ్వకుండా, ఏదో ఒక principle మీదనైనా నడపకుండా, వారుగూడ ఎప్పటికప్పుడు నూలుధరను పెంచుకుంటూ పోతున్నారు. మార్కెటులో ఉన్న speculation తోబాటు, తమ స్వంతమిల్లు మాదిరిగా నూలుధరను పెంచుతూ ఉంటే, యిది ఒకవైపున బాధకరముగా ఉంటున్నది. మరొకవైపున R. M. O. లు ధరలు తగ్గించకము జరుగుతూ ఉంటే దాని వల్ల బాధకలుగుతున్నది. గుంతకల్లు మిల్లులో నూలుధరనిర్ణయంలోకూడ Co-operative department ద్వారానే సూచనలుయిచ్చి ధరలను regulate చేసే ఏర్పాటుచేస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. ఆవిధముగా చేయకపోతే weavers యొక్క పరిస్థితి యిదివరకటికంటె అభివృద్ధి చెందటానికి ఎంతమాత్రము అవకాశములేదు. అందువల్ల గుంతకల్లు మిల్లువిషయములో కోఆపరేటివు డిపార్టుమెంటే ధరలను regulate చేసే ఏర్పాటుచేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

నూలుధరలను నిర్ణయించి regulate చేయుటకు Co-operative department సూచనలిస్తే బాగుంటుందని మనవిచేస్తున్నాను. ఈ Cess schemes ద్వారా వచ్చేడబ్బు కొద్దిగా మాత్రమే నిజమైన ప్రయోజనం పొందుచున్నదనీ, ఈ అధికారుల ఖర్చుకోసం ఎక్కువగా వ్యయం అవుతోందనీ చెప్పడానికి, కొంత వరకూ దుర్వ్యయం అవుతోందని చెప్పడానికికూడా State Society ప్రకటించినటువంటి కొన్ని అంకెలే తార్కాణంగా నేను చూపించగలను. 1953-54, 1954-55, ఈ రెండు సంవత్సరాల తాలూకు రిపోర్టు Cess schemes యొక్క

Sri P. Satyanarayana] [28th March 1956

Report ఒకటి ప్రచురించారు. అందులో ప్రాథమిక చేనేత సహకారసంఘాలలో చేరేవారికి వాటాలనిమిత్తం 4 లక్షల 74 వేల రూపాయిలు కేటాయించితే 3 లక్షల 62 వేల రూపాయిలు మాత్రమే ఖర్చుపడ్డాయి. అంటే 76% ఐనది. ఈ Society లకు పెట్టుబడి Working Capital క్రింద 18 లక్షల రూపాయిలు కేటాయిస్తూ 7 లక్షల రూపాయిలుమాత్రం పంచబడ్డాయి. అంటే అందులో నూటికి 40 వంతులుమాత్రమే పనిజరిగింది. 10 వ item depot లయొక్క పర్యవేక్షణఅన్నారు. వట్టి supervision కోసం 47 వేల రూపాయిలు sanction చేస్తే లక్ష 10 వేల రూపాయిలు ఖర్చైపోయింది. అంటే 232% ఐనదన్నమాట. Supervision కోసం 232% ఐనది. కేటాయించిన దానికంటె working Capital కోసం 40% మాత్రమే ఖర్చయింది. అది మనకు ఏమితెలియపరుస్తుందంటే మనంవేసిన Schemes లో, చాలా ఎక్కువగా ఉద్యోగుల ఖర్చుకోసం అవుతోందేకాని గ్రామస్థులకు సదుపాయము వచ్చేటటువంటి స్వభావంమాత్రం ఈ schemes లో తక్కువగా ఉన్నదని చెప్పకతప్పదు. ఈ రెండో పంచవర్ష ప్రణాళిక మూలసూత్రాల ననుసరించి చేనేతబట్టకు market కొంతవరకైనా విస్తృతమవుతుందని చాలామంది అనుకుంటున్నాం. ఆంధ్రదేశంలో ద్వారపూడి సంత చాలా ప్రధానమైనది. సంవత్సరానికి ఆరు, ఏడుకోట్ల రూపాయిల వ్యాపారంజరిగే బ్రహ్మాండమైనసంత. అందులో 4½ కోట్లవఱకూ పూర్తిగా చేనేతబట్ట మాత్రమే ఖర్చవుతోంది. సహకారశాఖమంత్రిగారు అక్కడకు సంతరోజులలో తప్పకుండా ఒకమారువెళ్ళి స్వయంగా చూడాలని కోరుతున్నాను. అక్కడ market అభివృద్ధి చేయడానికి చాలా అవకాశాలున్నాయి. కనీసం ఒకలక్షరూపాయిలు బిల్డింగు కట్టుటకు free grant ఇచ్చి, State Society కి అక్కడ ఒక పెద్ద బిల్డింగుకట్టి Marketing కు, Show కు తగినటువంటి అవకాశాలు కల్పించినట్లయితే ఇప్పుడు జరుగుచున్న 4½ కోట్ల వ్యాపారం 6 కోట్ల target వఱకూ ఈ రెండు మూడు ఏళ్లలో వృద్ధికావడానికి ఎలాంటి అనుమానంలేదు. అలాగే 60 వేల రూపాయిల వఱకూ ఇచ్చినట్లయితే పాలకొల్లులోకూడా మంచి Show rooms, ఒక Sales Depot పెట్టడానికి తగిన అవకాశాలుంటాయని మనవిచేస్తున్నాను చేనేత సొసైటీలలో 100 కి 80 మంది registered membership ఉన్నదని మనవి చేశాను. ఆ registered membership లో ఏదో 25 పెర్సెంటో, 30 పెర్సెంటో పనిచేస్తోంది తప్ప మిగతాదంతా idle membership. ఈ పనిచేస్తున్న వారికి కూడా నెలలో 20 రోజులు పనిచెయుతున్నారు. మళ్ళీ నాలితే 24

28th March 1956] [Sri P. Satyanarayana

రోజులు మాత్రమేగాని 30 రోజులు ఎవరూ పనిచెప్పలేకపోతున్నారు. డామాషామీద చూచినట్లయితే 100 కి 80 వంతులవరకూ చేనేతంతా ఈ co-operative పద్ధతిమీదఆధారపడిఉంది. ప్రభుత్వం ఇవ్వదలచుకున్నటువంటి scheme లలో సహాయంచేయడానికి ఏలాంటి అవకాశాలూలేవు. పోని రెండో పంచవర్ష ప్రణాళికలో వీరిలో 100 కి 75 మందినైనా లోపలికి తీసుకునే అవకాశం ఉన్నదా అంటే నమ్మడానికి వీలులేదు. ఆ విషయం ఖచ్చితంగా చెప్పలేకపోతున్నారు అందుచేత మూడో పంచవర్ష ప్రణాళికలో కేవలం అంతా co-operative field లో వచ్చేటటువంటి ఏర్పాటు ఉంటే ఉండవచ్చును గాని, ఈ రెండో పంచవర్ష ప్రణాళికలో మాత్రం master weavers క్రింద మాత్రమే 100 కి 60 మంది 80 మంది వరకూ weavers ఉండిపోక తప్పదు. వీరికి co-operative ఉద్యమం ఏవిధంగా సహాయపడడానికి సావకాశాలున్నాయి అనేది పెద్ద ప్రశ్న. నేను సూచించేదేమనగా ఈ Primary society లకు పెట్టిన డబ్బుకు ఎంత risk ఉన్నదో Master Weavers క్రింద పనిచేసే weavers కోసం independent గా పనిచేసే weavers కోసం పెట్టేటటువంటి Marketing society లలో పెట్టిన డబ్బుకి అంత ఎక్కువ risk ఉండదు ఒకవేళ మీకు All India Handloom Board వారుగాని, Central Government దగ్గరనుంచిగాని రావలసిన grants కొంచం ఆలస్యంగా వచ్చినా అసలు రాకపోయినా తక్కువ risk కల్గిన వ్యవహారంకనుక మీ అంతట మీరే చొరవతీసుకుని కొంతవరకూ Marketing societies ఏర్పరచవచ్చును. ఇక్కడికి సమీపంలో 20 మైళ్ళ దూరంలో కోడుమూరు ఉన్నది. అక్కడ తయారయ్యే ప్రతి అంగుళంబట్ట Mysore State కు పోయి అమ్ముకోవాలి. అక్కడ స్థానికంగా ఉండే weavers కి గాని, Master weavers కు గాని 100 కి 10 రూపాయిలు గిడుతూ ఉంటేమరో 10 రూపాయిలు మధ్య ఉండేవారు తినేస్తున్నారు వారు మార్వాడీలు కావచ్చు. లేక Canarese వాళ్లు కావచ్చును, లేక మైసూరు నుంచి వచ్చినవారు కావచ్చును. Marketing facilities కనుక మీరు ఇచ్చినట్లయితేవారు ఏదో 100 రూపాయిల సరుకు కాని మీరు Marketing Society పేరుతో Mysore లోనో, బెంగుళూరులోనో ఒక depot పెడితే ఆ సరుకు అక్కడ అమ్మి 60 నుంచి 75 వరకూ ఇవ్వవచ్చునని సూచన ప్రాయంగా All India Handloom Board వారు చెప్పారు. అట్లా చేస్తే మార్వాడీలమీద వారు ఆధారపడ వక్కరలేదు. అనవసరంగా 100 కి 10 రూపాయిలు మధ్య వారికి ఇవ్వనక్కరలేదు. ఇది మూడవ పంచవర్ష ప్రణాళికలోపున మనం తప్పకుండా చేస్తే తప్ప లాభంలేదు. 8 వ

Sri P. Satyanarayana] [28th March 1956

పంచవర్ష ప్రణాళికలో ఎక్కువ మంది Co-operatives లోకి వచ్చేస్తే అది వేరే విషయం. అందుచేత Marketing Societies అనే system ను ఈ సంవత్సరమే మీరు ప్రవేశపెట్టి కొన్ని Centres లో 'Marketing Co-operative Societies for Master weavers and independent weavers' అని ఏర్పాటు చేయవచ్చును. Central Bank వాళ్ళు weavers ను Directors గా తీసుకో వచ్చునని by-law ఉన్నా చాలా మంది తిరస్కరిస్తున్నారని మీరే చెప్పారు. మాకు legal గా అధికారం లేదు. బలాత్కారం చేయించడానికి అంటున్నారు. ఆ రకమైన వాదనచేయడం సరికాదు. ఇది వారిని ప్రోత్సహించడమే అవుతుంది. మీరు Reserve Bank కు వ్రాయవచ్చు, రిజర్వు బాంకు ఇస్తున్న డబ్బు వారికి ఉన్న విస్తృతమయిన కర్తవ్యాలను నిర్వహించడానికి ఇస్తోంది; అన్యాయం చేస్తే Reserve Bank ఇచ్చే funds విషయంలో జాగ్రత్త తీసుకుంటాము సుమా అని గట్టిగా చెబితే తప్పకుండా ఆ రకంగా చేస్తారు. మేము దగ్గర ఉండి Cess Fund Schemes ను అమలు చేయడానికి appoint చేయబడిన Deputy Registrar వచ్చినప్పుడు కాకినాడ బాంకు వాళ్లు సవ్యంగా తీసుకోనకపోతే గట్టిగా చెప్పించాము. వాళ్లు ఆలోచిస్తున్నారు. త్వరగా తీసుకునే సావకాశం కనిపిస్తుందేమో తెలియదు మాకు legal అధికారంలేదని ఒక మాట చెప్పి full stop పెడితే వారిని ప్రోత్సహించడమే అవుతుంది. అక్కడ ఒక కామా పెట్టి ఏమైనా threaten చేస్తే తప్పు ఏమీ జరగదు. వాళ్ల చేతిలోని డబ్బు Share Capital డబ్బుమాత్రమే కాదు. Reserve Bank నుంచి draw చేసి ఇస్తున్నారు. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో standard of life పెంచడానికి కృషిచేయాలి. ఇదివరకు Weavers Societies లో గజ 1 కి 0-6-0 కంటె ఇవ్వకూడదని ఒక Order అన్ని societies కు జారీ అయినది అలా కాకుండా 0-8-0 చేయాలని order ఉన్నా చాలాచోట్ల అమలుజరగడంలేదు. బలవంతంగా అమలుజరిగినచోట్లు కూడా ఉన్నాయి. Minimum wage 0-9-0 అని పెడితే, ఎక్కడయినా ఎక్కువ marketing అవకాశాలనుబట్టి ఇవ్వవచ్చునని పెడితే నా లెక్కప్రకారం రు 50 లు gross income వస్తుంది. అందులో రు 5 లు Contingencies కు పోయినా రు 45 లు మిగలడానికి అవకాశం ఉంటుంది. 5 గురు కలిగిన family కి పని కనిపిస్తుంది.

**SRI PRAGADA KOTAIAH** :—Continuous employment ఇస్తే కదా మీరు చెప్పేది?

28th March 1956]

SRI P. SATYANARAYANA :—Continuous employment ఇవ్వాలనే నేను చెప్పేది. Co-operative field లో అయినా లక్షకి 0-8-0 ఇచ్చేపద్ధతిని order జారచేస్తే కొంతవరకు బాగా ఉంటుందని నేను మనవి చేస్తున్నాను. పెడన, కొత్తపల్లి ఇంకా కొన్ని societies లో కేవలం పార్టీ రాజకీయాలు కారణంగా క్రొత్తవాళ్ళను చేర్చుకోడానికి తిరస్కరిస్తున్నారు. క్రొత్త societies పెట్టుకోడానికి తిరస్కరిస్తున్నారు. దీనికి basic law లో ఉండే లోపాలే చాలావరకు కారణం. సాధారణంగా societies లో చేరడం fundamental law గా చేస్తేనేతప్ప లేకపోతే ఆర్థిక వ్యవస్థలో ఒక భాగంగా చేయడం చాలా కష్టం Basic law మారవలసి ఉంటుంది. ప్రస్తుతం bill draft అయి సిద్ధంగానే ఉన్నది. కొన్ని కారణాలవల్ల ఆలస్యం అవుతోంది. కొద్దిరోజుల్లోనే Bill వస్తోంది ఎక్కువగా విస్తృతం చేయడానికి వీలు ఉంటుంది అంటున్నారు. కాని ఎంతవరకు జరుగుతుందో, విశాలాంధ్ర వచ్చినతరువాత ఎంతవరకు వాయిదాపడుతుందో తెలియదు. కనీసం ఒక circular అయినా issue చేసి అన్ని గ్రామాలలోను వీలైనంతమంది societies లో చేరేట్లా చేయాలని కోరుతున్నాను. ప్రభుత్వం ఇచ్చే Working Capital పరిమితుల్లో ఉండి, వాళ్లు తెచ్చుకునే Capital ఉంటే అలాంటివారినైనా ఇందులో చేర్చుకోవాలని ఒక order జారీచేస్తే చక్కగాఉంటుంది. Field Labour Co-operative Societies కు 25 ఎకరాలవరకు దేవాలయాలతాలూకు భూమిని ఇచ్చాము అని చెబుతున్నారు.

THE HON. SRI D. SANJIVAYYA:—Only lanka lands.

SRI P. SATYANARAYANA:—Temple lands ఇవ్వడం విషయంలో 5 వేల రూపాయలు దేవునికి ఆదాయంవస్తే అంతకంటే మించిన amount ఉంటేనే కాని ఇవ్వడానికి వీలులేదు అంటున్నారు. ఒక చిన్న పేచీ ఉన్నది. దేవాలయాల్లోని దేవుడు స్వంత వ్యవసాయదారుడయితే 10 వేల ఆదాయంవచ్చే భూమిమీద absentee land lord అయితే 5 వేల రూపాయిలు వస్తుంది. ఇక్కడ ఎట్లా నిర్వచనం చేయడం ?

THE HON. SRI D. SANJIVAYYA :—అర్చకులు వ్యవసాయం చేస్తారా?

SRI P. SATYANARAYANA :—నేను స్వయంగా చూస్తాను. రైతులకు కౌలుకు ఇవ్వకుండా అర్చకులు స్వయంగా వ్యవసాయంచేసే దేవాలయాలు చాలా ఉన్నాయి. The archaka is part of God's family.

[28th March 1956

THE HON. SRI D. SANJIVAYYA:—అర్చకుడు ఏమి అవుతాడు, brother అవుతాడా ?

SRI P. SATYANARAYANA :—అది మీరే నిర్ణయించండి. 5 వేల రూపాయిలు ఆదాయం వచ్చేయోగ్యత ఉంటే అదేభూమిని మీరు కౌలుకు ఇస్తే పైవారికి రు. 2,500 లు కంటే ఎక్కువ రాదు. ఈ రకమైన twist కొంతఉన్నది. ఏవిధంగా అయినామార్చి, దేవుడు absentee land lord కాకుండా స్వయంగా వ్యవసాయంచేస్తే రు 5000 లు వచ్చే భూమి అని నిర్ణయిస్తే ఎక్కువ భూమి field labour societies కు ఇవ్వడానికీ వీలుఉంటుందని మనవిచేస్తున్నాను.

SRI M. VENKATARAJU :—అధ్యక్షా, మన ప్రభుత్వంలో Co-operative Department అనేది ఒక తల్లి తండ్రి లేని బిడ్డవంటిది. దీనికి చాలామంది పాలుపోసి పెంచే విధానం ఈ ప్రభుత్వంలో ఉంది. మంత్రిగారు ఎక్కడెక్కడో జరిగేవి అన్నీ వారిపేర జమకట్టుకుని Labour Field Co-operative Societies పెడుతున్నాము; milk societies పెట్టాం అని ఒక పెద్ద జాబితా ఇచ్చారు. పాపం ఈ డిపార్టుమెంటు వారికి అధికారంలేదు. చాలా చోట్ల చాలా విధాల అన్యాయాలు జరుగుతున్నాయి. ఉదాహరణకు లంక భూముల societies పెట్టారు. అడిగారు Revenue Department వారిని భూమి available గా ఉన్నదా అని అడుగుతారు, ఉంటే register చేస్తామని, ఉండని వారు వ్రాస్తారు. Society register చేస్తారు. అంతే వారిపని. తరువాత వారికి పెత్తనంలేదు.

THE HON. SRI D. SANJIVAYYA :—ఇవి అన్నీ Autonomous Bodies కనుక మాకు అధికారాలు ఉండవు.

SRI M. VENKATA RAJU :—అదే నేను చెబుతున్నాను. ఆ భూములు ప్రతి 5 సంవత్సరాలకు lease కు ఇవ్వాలి. ఇచ్చినప్పుడల్లా తాసిల్దారు, కలెక్టరుగారు వారి ఇష్టం. ఇస్తే ఇస్తారు, లేకపోతే లేదు. వారిమీద కోపంవచ్చిన తరువాత ఏ మంత్రిగారు వంటివారోయితే వెంటనే ఆ leaseను రద్దుచేస్తారు మరొక society కి ఇస్తారు. ఈ society గతి ఏమి అవుతుందో తెలియదు. ఈ society ఎందుకు register చేశారో తెలియదు. తన బిడ్డకు బాధ వచ్చిందని చెప్పుకోవడానికైనా దిక్కులేదు. ఇటువంటివి అనేకచోట్ల జరుగుతున్నాయి. [illegible] అనేచోట ఒక society ని register చేశారు. 40 ఎకరాలు భూమి ఇచ్చారు. ఒక సంవత్సరం, lease,

28th March 1956] [Sri M. Venkata Raju

పంట వేసుకున్నారు. Revenue Department వారికి మంత్రిగారి కోరిక ప్రకారం ఆగ్రహం వచ్చింది. వెంటనే ఆ భూమిని ఇతర ఆశలు, రాజకీయ కక్షలు కారణంగా పెట్టుకుని నీతిని ఈవిధంగా వదలి మంత్రిగారు నాలుగు societies ను పంచాలి అని అన్నారు. Bye-law లో ఈ ఉత్తర దిశ భూమి ఉత్తర దక్షిణసొసైటీ చేయాలని, దక్షిణాన్ని చేయాలని ఉన్నది. దానిని కూడా వారు లెక్క చేయలేదు. ఈవిధంగా ఈ డిపార్టుమెంటు మీద ఇతర డిపార్టుమెంటులకు ఉండే విపరీతమైన హక్కులవల్ల ఈ డిపార్టుమెంటువారు ఏమీ చేయలేని స్థితిలో ఉన్నారు. Forest produce కోసం Labour Contract Societies పెట్టాం అని చెప్పారు. నాకు బాగా తెలుసు. కుంకుడు కాయలు, ఇతర forest produce కోసం societies పెడుతారు తరువాత ఆ departmental heads ఒప్పుకుంటే ఆ సంవత్సరం lease కు ఇస్తారు; లేకపోతేలేదు. ఆవిధంగా బాపట్ల దగ్గర ఒక society ఉంది. Central Bank లో 25 వేల రూపాయిలు అప్పు ఇచ్చారు. అప్పు తీర్చడానికి మార్గంలేదు. Forest లో ఉత్పత్తి అయ్యే వస్తువులు ఆ society కి ఇవ్వము అన్నారు. దానితో వారు దివాళా. డిపార్టుమెంటు మేనేజరు ధనికులతో కలిసి దానిని చెడగొట్టాడు. ఏ సంవత్సరానికో సంవత్సరం Forest Department వారు వ్రాయాలి, అంతేగాని వ్రాయరు. వారు అంగీకరించాలి. కుంకుడు కాయలు మార్చి, ఏప్రెలు మొదటి వారంలో కోస్తారు వీరి orders June లో వస్తాయి మీకు ఇచ్చాం అని, అప్పటికి అన్నీ రాలిపోతాయి. ప్రతి సంవత్సరం lease contract ఇవ్వడానికి అధికారాలు ఆ departmental heads క్రింద ఎందుకు ఉండాలో నాకు అర్థంకావడంలేదు. ఇది భారమైన ద్వంద్వ విధానం. అనేక సంవత్సరాలుగా ఈ ద్వంద్వపరిపాలన వద్దు అని చెబుతూ, ఈకోజాన ఈ విధానంతో ఈ ఉద్యమాన్ని నాశనం చేయడం క్షేమంకాదు.

ఇది ప్రభుత్వఅంగంలో ఒక అంగం. మీరు బాగా ఆలోచించి ఈ సొసైటీకి ఈ వస్తువులు ఇచ్చేముఅని చెప్పేరు. ప్రతి సంవత్సరముకూడా ఇస్తామని చెబుతున్నారు. కాని వారికి ఏమీ హక్కులేకుండా చెయ్యడంలో అర్థంలేదు. కాంగను కూడా కదబడదు. వారు పెత్తనం చెయ్యవలెనో, వీరు పెత్తనము చెయ్యవలెనో, ఉభయులూ చెయ్యవలెనో తెలియకుండ ఉండటంకన్నా, అటువంటి డిపార్టుమెంటు ఎత్తివేయండి. అనేక ప్రస్తావాలలా గావున్నది. పాలులేవు. ఈ ద్వంధవిధానము మార్చు చేసి ఒకసారి భూమిగాని Forest produce గాని ఇవ్వదలచుకుంటే, ఇస్తామని చెప్పిన తరువాత Society కి, Department కు పెత్తనం విపరీతపు అధికారాలివ్వుట న్యాయముకాదు. దానిని పూర్తిగా మార్చివేయవలెనని మనవిచేస్తున్నాను.

Sri M. Venkata Raju] [28th March 1956

ఇంక రెండవ ఘోరమైన విషయం average rate అని నిర్ణయము చేస్తున్నారు. 3, లేక 5 సంవత్సరాలు చెబుతున్నారు ఫారెస్టులో కుంకుడుకాయలుకు 5 సంవత్సరాలకు 1,000/- కట్టాలి. అంటారు ధరలేకపోయినా సరే 1500 కట్టవలెను. కుంకుడుకాయలధర పడిపోయినా పండకపోయినా ఈ ఫీజు మొత్తాలు కట్టలేక ఆస్తులు సర్వస్వాన్ని అమ్ముకుంటున్నారు. దానితో సర్వనాశనం అయి, ఉన్నది కాస్తా పోతున్నది 5 సంవత్సరాల average అని G. O ఉన్నదని ఎందుకు అనాలి? ఆ సంవత్సరం అక్కడ పండిందా, పండలేదా? ధర ఉన్నదా, లేదా ఆ సంవత్సరం ఎక్కువగా పండినదా. ఈ సంవత్సరమునకు ఫీజు మొత్తం వస్తుందా? అది నిర్ణయించి వారివద్ద తీసుకొనవలెనుగాని యీ విధంగా ఏవరేజి నిర్ణయం న్యాయముకాదు 12 వేల ఐదువందలు average rate ఇంతవరకు ఇవ్వలేముఅంటే Department పాటపెట్టి 6000/- కు ఇచ్చేరు. ఆ 6000 మేము ఇస్తామంటే, అలా ఇవ్వము, సొసైటివారయితే 12,500 ఇవ్వవలెను అంటారు.

(At this stage Mr. Deputy Speaker occupied the Chair.)

ఇంతకంటె అన్యాయం ఉండదు. బ్రిటిషుగవర్నమెంటు G.O లను అమెండు చెయ్యడానికి దమ్ములులేవు. మంత్రులు పడే పడే బీదలకొరకే వున్నామంటారు సిగ్గులేదు. ఇదేనా బీదలకుచేసే సహాయం. మీరు బాగా ఆలోచించి యిటువంటి అన్యాయాలను సరిచెయ్యండి.

THE HON. SRI D. SANJIVAYYA :—Forest Demand ఇప్పుడే వస్తుంది. అప్పుడు మాట్లాడండి.

SRI M. VENKATA RAJU :—యుద్ధములో దెబ్బతగిలి పడిపోయిన సిపాయీలగతిగావున్నది. బ్రతికియేయున్నాను. ప్రాణంవున్నది అనిచెప్పినా వినక డాక్టరు ఎర్రచీటికట్టాడు నీవు బ్రతికియున్నట్లుగాదు. నిన్ను పూడ్చాలి అంటారు. ఆ విధముగా ఉన్నది.

Fisheries Society పెట్టేరుగాని Department వారువచ్చి మాకు 10,000 చేపలు కావాలంటారు మేము ఆర్డరిచ్చేవరకు ఉండాలి అంటారు. బాపట్లలో ఒక dismissed constable, ఫిషరీసు జమానుగా ఉన్నాడు. ఆయనవచ్చిపట్టడానికి వీలులేదు అంటాడు. ఈ లంచాల ఒంట్రోతే అచ్చట గవర్నమెంటు. ఈ ద్వంద్వ విధానము మారవలెను. Department వారు చాల ఆటంకాలు కలుగచేయుచున్నారు. లంచాలుతిని dismiss అయిన వానికి తిరిగి పని ఏలాయిచ్చారు? [illegible] చేసే అది పనిపనులు వారు చేస్తారుగాని ఫలితము మరొకరు అనుభవిం

వలెను. కాంగ్రెసువారు స్వరాజ్యం వచ్చిన తరువాత Co-operative Commonwealth స్థాపించుతామని అందువల్ల అనేక రకాల సొసైటీలు పెట్టారు. అభివృద్ధిచేశారు

Weavers societies వున్నవి. Credit society లాగ liabilities లేవు డిపార్టుమెంటువారు సెంట్రలు బ్యాంకుకు రూ. 10,000 ఇవ్వండని, రికమెండు చేసి యిప్పించుతారు. ఇంకెవరికో 8000 ఇవ్వండి అంటారు ఇది ఎట్లా వసూలు అవతుందో ఎవరూ చెప్పలేదు. చెంబులతయారుచేసే society ని register చేస్తే సెంట్రలు బ్యాంకుచే 10,000 ల అప్పు, డిపార్టుమెంటువారు ఇప్పించినారు. చెంబులు పోయేయి, చేసేవారూ వెళ్లిపోయేరు. ఆ డబ్బు వసూలుకాలేదు గుంటూరు కో-ఆపరేటివ్ ఫెడరేషన్ పెట్టేరు. సెంట్రలు బ్యాంకునుండి 60 వేలు అప్పుతీసుకున్నారు. దమ్మిడీకూడా వారు ఇవ్వలేదు. యిష్టమొచ్చినట్లు తినేవారు. అలాగే ఇంకొన్ని సొసైటీలకు సెంట్రలు బ్యాంకు అప్పుయిచ్చింది. తిరిగి వచ్చే అవకాశంలేదు. 35,000 రైతులు జమ కట్టితే నిడుబ్రోలు సొసైటీ ప్రెసిడెంటు గుమస్తాలు తిన్నారు. పాపం తిరిగి రైతులవద్ద వసూలుచేసారు. బ్యాంకువారు పారుబాకీనిధి అని కొంత నిల్వచేయుచున్నారు. యిలాపోయే సొమ్ము గుంటూరు బ్యాంకులో మూడు లక్షలవరకూ వున్నది. 20 సం. వసూలు చేసే పారుబాకీనిధి, ఒక లక్షమాత్రమే. ఇంకా 2 లక్షలు కావాలి. బ్యాంకు పెట్టుకోలేదు, పై విధంగా పోయే డబ్బుకు ప్రభుత్వపు ఉద్యోగులే కారణం, గాన యీ రెండు లక్షలూ ప్రభుత్వ పెట్టుకోవలెను. లేకుంటె యీ నష్టానికి జవాబుదారులైన ఉద్యోగులవద్ద వసూలుచేయాలి. సెంట్రలు బ్యాంకు అప్పులు ఉద్యోగులు ఇవ్వమంటె ఇచ్చింది. బ్యాంకునే పెట్టుకోమనడం న్యాయంకాదు. లేకపోతే అప్పుమీద మెంబర్ల సొంత ఆస్తులుకూడా జవాబుదారీచేయండి

THE HON. SRI A. B. NAGESWARA RAO:—ఇవ్వం అన్నంత మాత్రాన గవర్నమెంటు సెక్యూరిటి లేకుండా సొసైటీలకు ఇస్తారా?

SRI M. VENKATA RAJU:—సొసైటీలు ఏమి పెట్టుకుంటారు. సభ్యుల ఆస్తులమీద హక్కు లేదు. షేరుకాపిటలుతప్ప సొసైటీకి ఇంకొక ఆస్తిఏమి ఉంది. ఇటువంటి పరిస్థితులలో ఈ సొసైటీ అప్పును మాఫ్ఫుచెయ్యకపోతే చాలా నష్టంవస్తుంది.

Sri M. Venkata Raju] [28th March 1956

ఎరువుల విషయములో మంత్రిగారు చెప్పేరు. ప్రభుత్వంవారు చాలా గొప్పపని చేసినారు. కో. ఆపరేటివు సొసైటిలకు పెత్తనము ఇచ్చి వాటిద్వారా రైతులకు అందచేస్తున్నారు. G. O. లో ఒక కమిటీవేసేరు. R. D. O. అధ్వర్యాన ఒక కమిటీ యీ ఎరువులు ఏ సొసైటీ ఇవ్వాలెనంటారో, ఎంత కోటా ఇవ్వాలెనంటారో, అంతే ఇస్తారు. ఏరియాలో ఏ సొసైటీవున్నదో ఆ ఏరియా రైతులను ఆ సంఘంలోవేసి వారిగ్రామాలకు ఎంత ఎరువు కావాలో వారే నిర్ణయించాలేగాని యీ కమిటీలోని ఉద్యోగస్థులపై ఈ భారం ఉంచితే తిరిగి వారి దయపై రైతులు ఆధారపడాలి. ఎవరిమీదో ఒకరిమీద ఆధారపడి బ్రతికేవారియిష్టం అది. రైతు జీవితబాధ తొలగించకపోతే ప్రయోజన మేమిటి ? అందువల్ల నేను వారికిమనవిచేసేది ఉద్యోగస్థులనుకూడా ఉంచండి, తాలోకాలో ముఖ్యంగా ఒక firka కు యిద్దరో ముగ్గురో రైతులనుకూడా కమిటీలో వేయండి. ఉపయోగించేదివారు. ఎట్లా ఉపయోగించుకోవాలి ఎంత ఎరువు కావాలి నిర్ణయించేదివారు. నేను ముఖ్యంగాచెప్పేది ఎల్లకాలం ఉద్యోగస్థులను యీ రైతులమీద ఎక్కించబోకండి. వాళ్లుకూడా ప్రజాసేవకులేనని మేము ప్రజలకోసం సేవచేసేవాళ్లుగా ఉన్నాం అనే భావం వారిలో కలుగలేదు. ప్రజాసేవకులుగా గాక ప్రజాభక్షకులుగా వున్నారు. అందువల్ల వారిలో మార్పు వచ్చేవరకు వారికి అధికారాలు ఇవ్వరాదు. రైతులకు కావలసిన ఎరువు రైతులే పంచుకోవాలి.

THE HON. SRI D. SANJIVAYYA :—కమిటీలలో రైతులుకూడా ఉన్నారు. ఎంతమందిని వేయాలని మీ సూచన ?

SRI M. VENKATA RAJU :—ఒక ఫిర్కాకు 5, 6 గురిని వేయాలి. సొసయిటీలుకూడా బ్లాకుచేసే ప్రమాదంవుంది. నిడుబ్రోలు సబ్ సొసైటీ విపరీతంగా బ్లాకులో అమ్మి 40 వేలరూపాయిలు ఇన్‌స్పెక్టరుతినివేసేడు దానిగతేమయింది ఇంతవరకు తెలుపలేదు; బ్లాకులో అమ్మే సొసైటీలకు తిరిగి ఎరువులు ఇవ్వరాదు. అసమర్థుల పెత్తనం లేకుండా మంచివారిచే సొసైటీలు నడిపించాలి.

SRI P. RAMACHARLU :—ఉపాధ్యక్షా, ఈ సహకారం దినదిన వ్యాప్తిచెందుతూన్నదానికి సంతోషం. ఈ 4, 5 సంవత్సరాలలో కొన్ని సంఘాలలో membership కూడా ఎక్కువయినది. ఇంకా ఎక్కువచేయాలి ప్రతి గ్రామానికి ఒక society పెట్టాలి ప్రతికుటుంబాన్ని member గా చేర్చాలని యీ Government యొక్క ఉద్దేశ్యమై ఉన్నది. కాని అందులోకూడా చిక్కులున్నాయి. ఆ చిక్కులు సవరిస్తేతప్ప ఆ చేసేటటువంటి ఏర్పాటు ఉద్దే

శ్యం నెరవేరదని మనవిచేస్తున్నాను. ఎందుకంటే గ్రామాలలో కూడా unlimited bassis మీద 10 మంది ఆస్తివంతులు సంఘం కావాలని ఏర్పాటుచేసుకుంటారు. వారి ఆస్తులు తాకట్టుపెట్టి ఆస్తికి 8 రెట్లు 10 రెట్లు అప్పు తెచ్చుకుంటారు. ఆస్తిలేనివారుకూడా members గా ఉంటే ఆ society దివాలాతీస్తే మొట్టమొదట ఆస్తిపెట్టిన పదిమందినుండి యిదంతా వసూలుచేస్తారు కాబట్టి నష్టపడతారనే కారణంచేత చాలమందిని చేర్చుకోరు. కొంత party దృష్టికూడా ఉంటుంది. ఈనాడు ప్రతిగ్రామంలో రెండుపార్టీలుంటాయి. ఒక parts చేతులో Co-operative society వుంటుంది. రెండో party వారిని రానివ్వకుండా చూస్తారు. బలవంతంచేసి చేర్చుకోవలసినదని చెప్పడానికి చట్టంలో ఏమీలేదు. కాబట్టి అటువంటి సందర్భంలో అందరికి గ్రామానికి ఒకటే society ఉండాలని కాకుండా రెండు society లు ఉండవచ్చు. లేదా యింకో గ్రామాన్ని చేర్చుకుని ఆ party వారు society పెట్టవచ్చు అనేటటువంటి నియమం ఏర్పాటుచేస్తేతప్ప నిర్బంధం చేసి member ను చేర్చుకునే obligation ఉంటే యిది పనిచేయదని మనవి చేసుకుంటున్నాను. రెండోది Central bank విషయంలో చెప్పాలి. ఈ Central Bank కు పూర్తిగా Reserve Bank, State Co-operative Bank డబ్బు యివ్వడంలేదు. అందుచేత Central Banks కు Share Capital ఉండాలి, ఆ Share Capital కాకుండా deposits కూడా ఉండాలి. ఇన్నీ ఉంటేనే కాని యీ ఋణం యివ్వడానికి సావకాశం కాదు. కాని ఆ bank మీద ఉన్నటువంటి నమ్మకంవల్ల deposits వస్తున్నాయని share holders కూడా చేరుతున్నారు. కాని యిప్పుడేమవుతున్నదంటే యీ department వారు circulars పంపించి యీ society register చేయండి, weavers society కి డబ్బు యివ్వండి, చేపల society లకు డబ్బు యివ్వండి అని ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా కొంత influence తెచ్చి పెడుతున్నారు. అటువంటి సందర్భంలో Central Banks డబ్బు యిచ్చినప్పుడు నష్టపడటం తప్పదు. ఇదివరకు నా అనుభవంలో ఒక Motor Transport సంఘాన్ని register చేయమని Registrar గారు తొందరచేశారు. Central Bank కు డబ్బు 40 వేలు పోయిందే. కాని వాళ్ళ bus తీసుకొని మా compound లో పెట్టి bus అమ్మడం వల్ల కొంత డబ్బు వసూలయినది. ఆ విధంగానే Labour Contract Society ని register చేయడం డబ్బుయివ్వడం తరువాత తిప్పికొంటే write off చేయడం సంభవిస్తున్నది. Weavers society లకు Share Capital లేకుండా అప్పుడ

Sri P. Ramacharlu] [28th March 1956

డబ్బు ఇవ్వవలసినవని ఉత్తరవులున్నాయి. Weavers Societyలను ఎవరోmanagement చేస్తూంటారు. వారిని నమ్మి డబ్బు యిస్తాం. 4 5 సంవత్సరాలకుకూడా వారు తీర్చలేకపోతే ఎవరు దానికి నష్టపడాలి, అనే టటువంటి అంశాలు బయటికి తేలలేదు. ఒక వేళ గట్టిగా వసూలు చేసేదానికి ఆ Weavers Society లో ఉండేటటువంటి Director, President ప్రయత్నం చేస్తే General body Meeting లో వాళ్లను తీసేసి కొత్త వాళ్లను ఏర్పాటు చేసుకోడం జరుగుతుంది. ఇటువంటి సందర్భంలో ఏవిధ ఆధారం లేకుండానే Weavers సంఘాలకు యిమ్మనడంలో, అప్పు యిమ్మని Central Bank కు చెప్పడంలో అర్థంలేదు. వారు ఏదో భావంతో యిచ్చారు. గవర్నమెంటు Circulars పంపించినా జవాబుదారీ ఎవరిదీ తేలేంతవరకూ అప్పు నివ్వడానికి వీలులేదని మనవిచేస్తున్నాను. ఎందుకంటే యీ విధంగా దివాలాగా ఉంటే society లకు యివ్వడం write off చేసుకోడంవల్ల ఉపయోగం లేదు.

Sri PRAGADA KOTAIAH .—Members ను expel చేయడం అనేది మొత్తం Co-operative సిద్ధాంతంలో ఉన్నది. కాని ఒక్క Weavers Co-operative Society లలో లేదు. పైగా యిచ్చినటువంటి loans కు losses వస్తే Government of India, State Government కలిసి మామూలుగా 75% assurance యిచ్చారు.

Sri P. RAMACHARLU:—ఇంతవరకు అటువంటిది జరగలేదు. Government assurance కూడా ఇచ్చారు. Relief works లో డబ్బు యివ్వండి అని మీరు అడుగవచ్చు అని assurance యిచ్చారు. G. O లో వున్న అనేక society లు relief works క్రింద యిచ్చారు. ఇచ్చినతరువాత State Co-operative Bank వారు మాత్రం మా డబ్బు యిమ్మని తగాదాచేస్తే యీ Government వారు పరిశోధనచేసి relief scheme క్రింద అంతా వాపసు యిస్తున్నాం అని కొత్తగా చెప్పడానికి సిద్ధపడ్డది. మా Central Bank దీనికి 1,50,000 గవర్నమెంటు భర్తీచేయవలసినదని G. O. లో ఉన్నప్పటికీ భర్తీ కాలేదు. ఇలాంటి అనర్థాలు వస్తున్నాయి. కాబట్టి నేను మనవిచేసేదేమిటంటే ఈ Weavers Co-operative Societies కు డబ్బు యివ్వకూడదు, ఏ సహాయం చేయకూడదు అనికాదు. Cess fund బ్రహ్మాండంగా డబ్బువస్తుంది కాబట్టి ప్రత్యేకంగా ఒక సంస్థ ఏర్పడినతరువాత లాభంపొందే ఏర్పాటుచేస్తే మంచిదికాని యీ Central Bank మధ్య తనయొక్క ఋణంగా పెట్టుకుని యీ విధంగా చేయడం కాగాలేదు అని మనవిచేస్తున్నాను. Weavers Societies కు

సహాయంచేయవలసినదే, ఆవిధంగా, కేంద్రప్రభుత్వంవారు డబ్బుతెచ్చి వేరే ప్రత్యేక సంస్థ ఏర్పాటుచేసి యివ్వడంలో ఆక్షేపణలేదు. కాని Central Bank ను నష్టాలన్నీ తట్టుకోమంటే అది సాధ్యంకానిపని ఇంకోవిషయం ఏమిటంటే Central Bank అంతాకూడా డబ్బు వసూలుచేయాలి. Central Bank Director, President అంతాకూడా sanction చేస్తున్నారు. చేసినతరువాత వసూలుచేసేటప్పుడు ఖచ్చితంగా ప్రతిసంవత్సరం వసూలుచేయవలసివున్నది. కాని ఎవరైనా యీయకపోతే arbitration references file చేస్తే Senior Inspector, D.R. C.S.R. తీర్మానంచేయవలసినదిగావున్నది. Execution కూడా వాళ్ళే జరుపవలసినదిగావున్నది. ఇటువంటి సందర్భంలో non-officials కు ఏమాత్రంకూడా అధికారంలేదు. Central Bank Director, President, వీరంతాకూడా అప్పులు sanction చేయడమేకాని యివ్వడంలేదు. నిర్బంధంగా వసూలుచేయడానికి ఏవిధమైనటువంటి ఆధారంలేదు. మావాటిని పిల్చుకువస్తానన్నట్లుగా Department కు appeal చేసుకోడమే. ఈ విధంగా arbitration references 1,000, రెండువేలు నిలిచిపోయాయి. రెండుమూడేండ్లయినాకూడా అవి బయటికి రావడంలేదు. కాబట్టి యిది ఒక చిక్కు ఏర్పడింది. ఈ Central Bank ను A, B, C అని 3 వర్గాలుగా ఏర్పాటుచేశారు. Reserve Bank వారు A, B Classes కు యిస్తారు కాని C Class వారికి డబ్బు యివ్వడంలేదు. కొంచెం grades గా B Class వారికి తగ్గించి యిస్తున్నారు.

A,B,C, Class లు పెట్టినదానివల్ల A, Class రావడానికి ప్రతి సెంట్రలు బ్యాంక్సు అన్నిసొసైటీలనుంచి సంవత్సరములోపలే వసూలుచేయడానికి ప్రయత్నము చేస్తారు. 10 దినములలో ఇవ్వమని నిర్బంధముగా చెబుతున్నారు. ఇది సహకార సూత్రాలకు విరుద్ధంగా ఉన్నటువంటిపద్ధతి అని మనవిచేస్తున్నాను. 30 హరిజన సొసైటీలు ఉన్నాయి. ఈ 30 సొసైటీలు default అయితే A, B Classification లోనికి రావు. ఒత్తిడి పూర్తిగా ఉండినా, ఉండకపోయినా ఇంట్లోదూరి వసూలుచేయడం జరుగుతున్నది. అందువల్ల హరిజనులకు ప్రత్యేక సొసైటి అవసరములేదు. హరిజనుడిని ఒకరిని డైరెక్టరుగా వేస్తే వారికి నిబంధనలు ఏర్పాటుచేయవచ్చును. A,B,C, అనే Classification లో ఈవిధమైన ప్రమాదములు జరుగుతున్నాయి. ఈ సెంట్రలుబ్యాంకులో అధికారులు నాన్ ఆఫీషియల్సుకు ఇలా డబ్బు వసూలుచేసేపద్ధతి ఇంకొకరికి ఇవ్వడంవల్ల చాలా అన్యాయములు జరుగుతున్నాయని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

[28th March 1956

* SRI B. SUBBA RAO :—అధ్యక్షా, కో-ఆపరేటివ్ స్కీము క్రింద ప్రస్తుతం అమలులో ఉన్నటువంటి గృహ నిర్మాణ విధానం హరిజనులకుగాని, ఇతర పేదలకుగాని ఏ మాత్రం ఉపయోగంగా లేదని మనవిచేస్తున్నాను. ఆ స్కీములు ధనవంతులకే బాగా ఉపయోగపడుతున్నవి హరిజనులకు ఎక్కడయినా స్థలము ఉంటేకూడా అందులో ఇళ్లు కట్టుకోవాలన్నా ఇప్పుడున్న రూల్సు ప్రకారం సాధ్యపడకుండా ఉన్నది. చేనేత పారిశ్రామికులకు రు. 3,600 లు ఇండ్లు కట్టుకొనుటకుగాను స్కీమును తయారుచేశారు ఇది రు. 1200 లు సబ్సిడీగాను, రు. 1800 లు 25 సంవత్సరములలో తీర్చుకునే పద్ధతిగాను అప్పు ఇవ్వబడ్డది. అది వారికిచాలా ఉపయోగంగా ఉన్నది. ఆ విధంగానే హరిజనులకు ఇస్తే చాలా ఉపయోగపడుతుంది. హరిజనులు ఎక్కడైనా కొన్ని సొసైటీలు రిజిస్టరు చేయించుకొని తద్వారా అభివృద్ధి పొందాలంటే చాలా ఆటంకములు కలుగుతున్నాయి. రిజిస్ట్రారుకు దరఖాస్తులు పెట్టుకున్న, కో-ఆపరేటివ్, సెంట్రలు బ్యాంకు సిఫార్సు చేస్తేనేగాని రిజిష్టరు చేయడం జరగడంలేదు. అక్కడ ఉండే రాజకీయ కారణముల వల్ల ఆ సెంట్రలు బ్యాంక్సు సిఫార్సు చేయకపోవడం జరుగుతున్నది. అందువల్ల రిజిస్ట్రార్లు రిజిష్టరు చేయడములేదు. కొన్ని రిజిష్టరు అయిన సొసైటీలను సెంట్రలు బ్యాంకు affiliation చేసుకోవడములేదు. దానితో సెంట్రలు బ్యాంకునుండి loan తీసుకోడానికి వీలులేకుండా ఉన్నది. అందువల్ల ప్రస్తుతం సెంట్రలు బ్యాంకు నిబంధనలను సవరించి, Field Labour Co-operative Society, Central Banks తప్పనిసరిగా affiliation చేసుకునే పద్ధతిని చూడవలసిందిగా కోరుతున్నాను. ఈ Field Labour Co-operative Societies చాలా అధ్వానంగా ఉన్నాయి. వాటిని ప్రభుత్వం సవతితల్లి ప్రేమతో చూస్తున్నది. ఆనేక లంక భూములను లీజుకు ఇస్తున్నారు. ప్రస్తుతం 3 సంవత్సరముల average rate అమలులో ఉన్నది. దీనివల్ల ఎకరం ఒకటికి రు 200, 300 లు అవుతున్నవి అందువల్ల అభివృద్ధికి బదులు సొసైటీ మెంబర్లు కొందరు ఇల్లు వేలము వేయించుకోవడముకూడా జరుగుతున్నది. ఈ సొసైటీలను ఏమైనా బాగుచేయదలచుకుంటే, ప్రస్తుతం అమలులో ఉన్న 3 సంవత్సరముల average rates రద్దుచేసి, ఒక ఎకరానికి 4 లేక 5 రూపాయిలు rate పెట్టి అభివృద్ధి చేయాలని నేను కోరుతున్నాను.

గ్రామాలలోని జలాధారములలో ఉన్నటువంటి చేపలు, చెట్లనుండి వచ్చేఫలసాయము, Field Labour Co-operative Society లకు lease కు ఇచ్చి అభివృద్ధి చేయవలసినదిగా కోరుతున్నాను. అదేవిధంగా దేవస్థానం భూములు మంత్రిగారు

చెప్పినవిధముగా రు. 5000 లు ఆదాయం దాటితేనేగాని, లీజుకు ఇవ్వమని చెబుతున్నారు. ఈ 5 వేల రూపాయిలు అని నియమములేకుండా, ఎంత ఆదాయం వచ్చినప్పటికిని, Field Labour Co-operative Society లకు ఇచ్చి అభివృద్ధి చేయవలసినదిగా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri B. APPALASWAMY :—అధ్యక్షా, సహకార పద్ధతిమీద మాట్లాడేటప్పుడు ముందుగా 2 విషయములు చెప్పవలసిఉన్నది ఇదివరకు కాంగ్రెసు లెజిస్లేచరు పార్టీలో సహకార సంఘాలగురించి, లంక భూములగురించి ఒక కమిటీనివేశారు. చాలా కాలమునుంచి సహకార సంఘములకు, ప్రభుత్వానికి మధ్య ఉంటే అభిప్రాయ భేదములు పరిష్కారము అయ్యేదానికి నేను 1952 లో శాసనసభ్యునిగా ఉన్నప్పట్నుంచి ఈ విషయం చెబుతూనే యున్నాను. సహకార సంఘాలు ఏమిటో, ప్రభుత్వవిధానము ఏమిటో, సహకార సంఘాలు ఎంతవరకు సహకారము చేస్తున్నాయి అని, ఆలోచించక దానిని తృణప్రాయంగా త్రెంచి గవర్నమెంటువారుగాని, ప్రజాప్రతినిధులుగాని, అధమం ఏమీచేయలేదని చెప్పడానికి నేను సంకోచించడము లేదు. సహకార సంఘాలు, ప్రభుత్వము ఇచ్చిన భూములు, లంక భూములు అయితే నేమి, దేవాలయాల భూములు అయితేనేమి, వాటి విషయములో చూచినట్లయితే ప్రజలలో ఏడవని మానవుడు లేడు. దున్నపోతును మేపుకుంటూంటే ప్రభుత్వము ఏదో గ్రాంటు ఇస్తున్నది. గొర్రెను మేపుకుంటే ఏదో గ్రాంటుఇస్తున్నారు. పందులను మేపుకుంటూంటే ఏదో బహుమతి ఇస్తున్నారు; వీటివాటికో లక్షలడబ్బు ప్రభుత్వము ఖర్చుచేస్తున్నది. పోరంబోకు భూములు చేసుకుంటున్న; హరిజనుల సొసైటీలకుగాని, లంకభూముల విషయంలోగాని ప్రభుత్వం ఈనష్టాత్రము దయ, కనికరము, న్యాయం చూపించడంలేదని చెప్పడానికి నేను వెనుకాడడంలేదు. తలారి గోపాలరెడ్డిగారు మా తూర్పు గోదావరిజిల్లా కలెక్టరుగా ఉన్నప్పుడు, గోదావరినదీమ తల్లి కనికరించివేసిన లంక భూములుకూడా మాలవారికిస్తే సుఖపడుతారు అనే అభిప్రాయముతో, ఆ లంకలోని కొంతభూమిని ఇది గుడికని, ఇది బడికని, ఇది నివేశనస్థలములకని కేటాయించి, 50, 60 మంది పేదవాళ్లకు అక్కడ నివేశనస్థలములుఇచ్చి, ప్రభుత్వానికి కొంత డబ్బు కట్టండి అని చెప్పారు. ఆ భూముల్లో వారు కట్టుకున్న కొంపలలో వారు ఉండడానికి వీలులేకుండా ఈనాటి ప్రభుత్వంచేస్తున్నది. ప్రస్తుతం ప్రభుత్వమువారు, లంకభూములన్నీకూడా, సమ్మనైన రేటుకు, ఈ సొసైటీలకిచ్చి, వారిని అభివృద్ధిలోకి తీసుకొనిరావడానికి నిశ్చయించినారు. అక్కడ పేదవాళ్లు పశువులను, గొర్రెలను మేపుకొంటున్నారు. కాబట్టి కొంతవరకు గ్రామకంఠస్థలాలు

Sri B. Appalaswamy] [24th March 1956

కొంతభూమిని కేటాయించడము ధర్మము అని అంగీకరించినప్పటికీ, ఆ భూమి ఎటువంటిదో చూచి, మంచిభూమిని వేలంపాట పెడుతూఉంటారు చవిటి భూములను సొసైటీలకు లీజుకు ఇస్తూంటారు. అవి పంటలు పండక సొసైటీలు నాశనము అయిపోతున్నాయి. వాటినిచూచి కంటతడి పెట్టే నాధుడు ఎవరూ కన్పించడములేదు. Write off చేయండని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. వారు బ్రతుకలేరు, వారికి ఉండడానికి కొంపగోడూలేదు, కొంపలో చిప్పలేదు, ఉన్న గడ్డ కర్రయావత్తూ నేలమువేసి, ఇల్లు సహితము నాశనము చేసి నష్టేటిలో కలిపేస్తున్నది ఈ ప్రభుత్వవిధానం అని నేను విచారిస్తున్నాను. ఇటువంటి ప్రభుత్వవిధానములను నేను చెప్పతున్నానంటే, సభ్యులంతా Hear, Hear అంటూ సంతోషిస్తూ కూర్చుంటూంటే ఏమీలాభములేదు. ప్రభుత్వవిధానాన్ని గురించి నేను చెబుతుంటే ఎవ్వరికీ కనికరం కలుగుటలేదు. వినోభాజీ భూదాన యజ్ఞముకోసం, ఊరూరా తిరుగుతూంటే మనం హారతులుఇచ్చి ఆహ్వానిస్తున్నాము. సోషలిస్టిక్ పాట్రన్ ఆఫ్ సొసైటీని స్థాపించాలని మనం వేనోళ్లతో గొంతెత్తి పాడుతున్నాము. ఈ రోజున గోదావరి, కృష్ణానదీమతల్లులు కనికరించివేసిన లంక భూములను, బీదలకు ఇవ్వాలి. ప్రభుత్వము ఎవరో జమీందారులదగ్గరనుంచి లాక్కొని బీదలకు పంచిపెడతాము అని చెప్పేబదులు, ముందు మీ చేతులలోఉన్న భూములను పేదవారికి తక్కువరేటుకు ఇవ్వడములో ఆక్షేపణ ఏమిఉన్నదో నాకు బోధపడడములేదు.

Sri S. BRAHMAYYA :—ప్రభుత్వ విధానంగురించి చెప్పడం మానుకొని, కో ఆపరేషన్ గురించి చెబితే బాగుంటుంది.

Sri B. APPALA SWAMI .—ప్రభుత్వము ఈ విధానాన్నంతా సమదృష్టితో చూసి లంకభూములన్నికూడా న్యాయమైన rate కి జిరాయితీ చేటుకు, సొసైటీలకు యిప్పించడానికి ప్రయత్నం చేయవలయునని 3 సంవత్సరములనుంచి చెబుతున్నాను.

సహకారం, సహకారం అంటారేగాని, సహకారము ఏమిటో నాకు అర్థము కావడంలేదు. Land Mortgage Bank లో నా తమ్ముడిచేత ఒక అప్లికేషను పెట్టించినాము. మా తమ్ముడికి 20 ఎకరములభూమియున్నది. అది తనఖా పెట్టి 5 వేలరూపాయిలు అప్పుకావలయునని కోరినాము. అమలాపురం బ్యాంకు ఎన్నాళ్లనుంచి ఉన్నది, దానికి గవర్నమెంటు ఎంతడబ్బు సహాయముచేస్తున్నదో నాకు తెలియదు. ఒక 20 వేల ఎకరాలుగల ఆసామి, 5 వేలరూపాయిల అప్పుఇవ్వమని, [illegible] పెట్టిన దరఖాస్తు విన్నకాంక్షమ అయింది.

నావంటి సామాన్యమానవుడు ఆ House Co-operative Societies వలన ఏవిధంగా సహాయం పొందగలడు అనేది ప్రభుత్వంవారు ఆలోచించాలి. Housing Co-operative Societies అని స్థాపించినారు. వాటికి ఏవో లెక్కలు వేస్తున్నారు. నేను ఒక ఇల్లు కట్టుకుందామని దరఖాస్తు వేసి 2 సంవత్సరములయినది. ఇంతవరకు నాకు డబ్బురాలేదు. మార్చి 31 వ తేదికి డబ్బు ఇస్తామని ఉత్తరం వచ్చినది. నాకున్న సొమ్ముతో స్థలం కొనుక్కున్నాను. నావద్దరవున్న కొంత ఆస్తిని తాకట్టుపెట్టినట్లయితే డబ్బు ఇస్తారట. స్థలములున్నవారందరికి ప్రభుత్వమే ఇల్లు కట్టించి అందుకయిన ఖర్చు ఆతనివద్దర వసూలు చేసుకోకూడదా? 20 సం॥లు time limit పెట్టి 20 సం॥లోను ఇవ్వకపోయినట్లయితే అతనిని ఆ ఇంటిలో నుండి తొలగించవచ్చును. పోలీసులున్నారు కదా? Members, మంత్రులు అంతా ఉన్నారు కదా? ఇటువంటి సహకారమేమీ చేయకుండా ధనవంతులకే ఇంకా ఎక్కువడబ్బు ఇచ్చేవిధంగా ఉంది ఈనాటి ప్రభుత్వం. నేను అనేక విషయములను ప్రభుత్వంవారిదృష్టికి తీసుకొనివస్తున్నాను. కాని ప్రభుత్వంవారు ఏమీ చర్యలు తీసుకొనుటలేదు. నేను, ఇతర శాసనసభ్యులు చెప్పిన విషయము లన్నింటినీ ప్రభుత్వంవారు దృష్టిలోకి తీసుకొని నవ్వులాటగా భావించకుండా serious గా ఆలోచించాలని కోరుతూ విరమిస్తున్నాను.

SRI PRĀGADA KOTAIAH:—ఉపాధ్యక్షా! నేను ముఖ్యమైన రెండు, మూడు విషయములు చెప్పి త్వరగా ముగిస్తాను. చేనేత పనివారల సహకార సంఘమునకు చాలినంత ఆర్థికవసతి కల్పించే నిమిత్తం ఒక Financial Corporation ను నెలకొల్పుటకు ప్రయత్నిస్తున్నారని మన మంత్రిగారు ప్రకటించినందుకు వారిని అభినందిస్తున్నాను. కాని అందులో ఒక చిన్న చిక్కు పెట్టినారు. ఇది ఏదో ఒక పెద్ద ఫండుతో కలవాలి, అందువల్ల కేంద్రప్రభుత్వంవారితో సంప్రదించి వ్యవహారం సాగిస్తామన్నారు. మేము మా దరఖాస్తులో ఇండియాప్రభుత్వంయొక్క ధనంగాని, రాష్ట్రప్రభుత్వంయొక్క ధనంగాని మాకు అవసరంలేదు అని స్పష్టంగా తెలియజేశాము. మేము మా కవసరమైన ధనమును వసూలుచేసుకుంటాము. మా డబ్బుతోనే ఒక Financial Corporation నిర్మించవలసింది అన్నాము. ఇండియా ప్రభుత్వమువద్ద ముడిపెట్టి కొన్ని సంవత్సరములు కాలయాపన జరుగకుండా అవసరమయిన ధనం సేకరించుకొనుటకు మేము సిద్ధంగా ఉన్నాము. కనుక ఆంధ్రరాష్ట్రప్రభుత్వం ఈ సంఘ రిజిస్ట్రారుకొరకు ఉత్తరువులు జారీచేస్తూ, సంఘనిర్మాణానికి ఒక Special Deputy Registrar ను వెంటనే appoint చేయవలసినదిగా కోరుతున్నాము. గత 3 సం॥లలో అనగా 53-54, 54-55, 55-56 లలో ఈ చేనేత

Sri Pragada Kotaiah] [28th March 1956

సహకార సంఘములలో 15 వేల మందిని సభ్యులుగా చేర్చుకోవచ్చునని సెస్సుఫండు ధనంలో కేటాయించబడింది. కాని department వారి జాప్యంకారణంగా 11,890 మందిని మాత్రమే చేర్చుకున్నారు. ఇంకా 3,110 మెంబర్లను చేర్చుకోవలసియున్నది. చేర్చుకొనకపోయినట్లయితే డబ్బువచ్చేసంవత్సర, లెక్కలలోకి పోతుంది. లేదా lapse అయిపోతుంది ఇటువంటి విషయములలో డిపార్టుమెంటువారు జాప్యం లేకుండా, చురుకుగా పనిచేయుటకు ప్రభుత్వంవారు శ్రద్ధతీసుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను. Sales department మొదలయినవాటికి అదనంగా ఖర్చుపెట్టాలని పుచ్చల సత్యనారాయణగారు చెప్పారు. ఇండియా ప్రభుత్వంవారు ఇచ్చినటువంటి అధికారం సరియైనదికాదు. ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘంవారు తమ డబ్బు మండి వెచ్చించారు, కాని అక్కడ రిజిస్ట్రారుగారు ఇండియా ప్రభుత్వంవారినుండి re-imburse అయిన మొత్తంమూను మాత్రమే చూపించారు. అంటే ఈనాడు ఇండియాప్రభుత్వంవారు మంజూరుచేసినటువంటి ధనం సరాసరిని ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘమునకు చేరలేదు. అందువల్ల తక్కువగా కనబడుతున్నది. అంతేకాని ఇది వేరువిధంగా జరగలేదని మనవిచేస్తున్నాను. గుంతకల్లు నూలుమిల్లుకూడ ప్రత్యేకంగా పెట్టుకున్న మార్కెటుప్రకారంగా నూలు ఇస్తున్నదన్నారు. అట్లా ఇవ్వక తప్పదు. దేశంమొత్తంమీద ఉన్నటువంటి నూలుమిల్లులన్నిటికీకూడ మంచిధరలు వస్తున్నప్పుడు ఒక గుంటకల్లు నూలుమిల్లుకు మాత్రం అది సహకారమిల్లు అయినప్పటికీకూడ తక్కువ మారకం ఇచ్చినట్లయితే ఆ నూలు దుర్వినియోగం అవడానికి కావలసినన్ని అవకాశాలున్నాయి అట్లాంటి దుర్వినియోగంకూడా జరిగింది. తీరా మార్కెటు రేటుకు అమ్మినప్పటికీకూడ దానిమీద వచ్చేటటువంటి లాభం వారు ఉపయోగించేటటువంటి చేనేత ప్రాథమిక సహకారసంఘాలకు చేరబడుతుంది. దానిని గురించి మనం ఆందోళనచెందవలసిన అవసరంలేదని మనవిచేస్తున్నాను. చేనేత సహకార సంఘాలలో 100 కి 80 మంది ఉన్నప్పటికీ వారికిమాత్రం సరియైన సహాయం లభించడంలేదు. వారికి సహాయం లభించేటట్లు చేయాలంటే ప్రభుత్వం వారు రెండువిధాలుగా చేయాలి మొన్న మేము ఆంధ్రరాష్ట్రచేనేత సహకార సంఘములోకూడ సూచించాము. Purchasing and marketing agencies పెట్టవలసిందని సూచించాము. వారు Co-operative Societies కు రావడానికి అవకాశముంటే సహకార సంఘములలోనే చేరవచ్చును. అట్లా కాకుండా ప్రభుత్వమే వారికి కొన్ని సౌకర్యములు కల్గజేసి నాణ్యతం కలిగినటువంటి బట్టలు నేయించి వాటిని విక్రయశాలలద్వారా అమ్మించుటకు ప్రభుత్వం పూనుకోవాలి. ఈ విధంగా మన ఆంధ్రరాష్ట్ర Handloom కమిటీవారుకూడ సిఫార్సు చేశారు. వారికి అవసరమైన ధనం పెట్టుబడిపెట్టాలని నేను మనవి చేయు

చున్నాను. ఈ రెండు విషయములుకూడ ఇప్పుడు నూతనంగా ఏర్పడినటువంటి All India Handlooms Fabric Co-operative Marketing Society యొక్క అజమాయిషీలో ఉన్నాయనుకుంటాను. వానికి Chairman గా Textile Commissioner ఉన్నారు. బహుశా వారు ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో దీన్నిగురించి పూనుకుంటారనుకొంటాను.

ఒకవేళ చేయక పోయినట్లయితే ఆ పనిని ఆంధ్రప్రభుత్వం చేయవలసినదిగా కోరుచున్నాను. కుటీరపరిశ్రమలకు మేము ప్రోత్సాహమిస్తున్నాము అంటున్నారు ప్రభుత్వంవారు. ఈ కుటీరపరిశ్రమ సహకార సంఘాలకు మోడల్ బైలాస్ లేవంటున్నారు Hand pounding of Rice Co-operative Societies పెట్టాలిఅని చెబితే మోడల్ బైలాస్ లేవు Carpenters Co-operative Societies పెట్టండిఅంటే Model Bye-law లేవు. ఈ మోడల్ బైలాస్ లేని కారణంగా సంఘమును రిజిష్టరు చేసుకొనుటకు ప్రభుత్వంవారు అంగీకరించినప్పటికీకూడ 3, 4 మాసములనుంచి అనేక సంఘములు రిజిష్టరుకాకుండా ఆగిపోయిన ఉదంతాలున్నాయి, కావాలంటే మంత్రివర్గం దృష్టికి తీసుకు రాగలను. ఒకరినో, ఇద్దరినో Deputy Registrars ను నియమించి మోడల్ బైలాస్ ఏర్పాటు చేయించుటకు పూనుకోవలసిందిగా కోరుతున్నాను, ప్రభుత్వంవారు పెట్టదలచుకున్న Cottage Co-operative Industries కు మోడల్ బైలాస్ ఏర్పాటుచేయవలసినదని మనవి చేస్తున్నాను. కొన్ని సహకారసంఘములలో సభ్యులను చేర్చుకొనుటకు నిరాకరిస్తున్నారు, కాబట్టి ఆ చట్టమును సవరించి రిజిష్ట్రారుగారికి అదనంగా అధికారాలు ఇవ్వవలెనని మంత్రిగారు అన్నారు. దానివలన చాలా చిక్కులున్నాయని మనవిచేస్తున్నాను. ఎక్కడైనా 2 సంఘములు ఉండుటవలన పోటీ ఏర్పడదు. వేలకొలది జనులున్నటువంటి గ్రామములో 2 సంఘము లుండుటవలన పోటీ ఏర్పడదు. రెండు సంఘములను పెట్టడం మంచిదనే నా అభిప్రాయం. ధనవంతులుగా ఉంటేవారిదగ్గర 2 సంఘాలు తీసుకురావడమనేది ఒక ఒరలో 2 కత్తులు ప్రవేశపెట్టినట్లుగా ఉంటుంది. మనరాష్ట్రంలో Co-operative Advisory Board ఉన్నది. కాని మన శాసనసభ్యులు ఆ Co-operative Advisory Committee లో ఉన్నట్లుగా కనిపించదు. అసలు ఆ కమిటీ సరిగా function చేస్తున్నదో, లేదో, తెలియదు. మన శాసనసభ్యులలో నిపుణులైనవారు ఉన్నారు. కాబట్టి వారికి ఆ Co-operative Advisory Committee లో స్థానం ఇచ్చి, ఆ కమిటీవారు ప్రతి ఒక సమస్యనుగురించి జాగ్రతగా ఆలోచించి ఎప్పటికప్పుడు ప్రభుత్వానికి సలహా లిచ్చుటకు ఏర్పాటుచేయవలసినదిగా కోరుతున్నాను. Fisheries Co-operative

ri Pragada Kotaiah] [28th March 1956

వ్యవహారంలో గాని Tenants Co-operative Society వ్యవహారంలో గాని రెండింటికీ రిజిస్ట్రరు చేసేటంతవరకే ఈ Co-operative Department కు అధికారం ఉంటుందితప్ప చేపలను వేలంపాటకిచ్చేవిషయంలో గాని, భూములను కౌలుకిచ్చే విషయంలో గాని Tenants Co-operative Societies కు అధికారం లేనందువల్ల ఈ Societies అన్నీ నిరర్థకమైపోతున్నాయనే విషయం ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొనివస్తున్నాను. ఒకసారి, Co-operative Societies పెట్టి 100 ఎకరములు కౌలుకు ఇచ్చినతరువాత ఇది ప్రతిఏటా renew కావాలంటే Revenue Inspector దగ్గరనుంచి మానసబు, కరణములదగ్గరనుంచి డిప్యూటీ తహశీల్దారుగారివరకూ లంచాలుపెట్టినప్పటికీకూడ పనిజరగని పరిస్థితిలో ఉన్నప్పుడు ఇటువంటివాటికి ప్రభుత్వం సహాయంచేయలేనప్పుడు Revenue Department కు Co-operative Department కు మధ్య ఒక Co-ordination Committee ని నియమించి అవి ఉన్నతస్థాయిలో ఉండేటట్లు ఏర్పాటుచేయాలి. ఈవిషయమును చాలాకాలంనుంచి ప్రభుత్వంవారు ఆలోచిస్తున్నామంటున్నారు. కాని ఇంతవరకు విచారణ జరిపించినట్లు కనిపించదు. ఇతర department లకు Agriculture and Co-operative Department, Land Revenue Department లకు ఒక Co-ordination Committee ని వేయాలి. అట్లాగే District level లో కూడ ఒక Co-ordination Committee ని వేసి ఈ సంఘముల నన్నింటినీ బాగుచేయుటకు ప్రత్యేకమైన కృషిచేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI G. NARASIMHAMURTHI :—అధ్యక్షా, రైతులకు ఎరువులు సప్లయిచేయడములో కో-ఆపరేటివ్ సొసైటీల ద్వారా ఏర్పాటుచేస్తున్నామని మంత్రిగారు చెప్పారు. అది చాలా సంతోషదాయకమైన విషయము. Society లకు ఈ ఎరువుల కోటాలు నిర్ణయించడంలో గౌరవ సభ్యులు వెంకటరాజుగారు చెలవిచ్చినట్లు కలెక్టరునో, ఉద్యోగస్థులనో కూర్చోపెట్టి ఎరువు కోటాలు నిర్ణయించడం కంటె ఏ గ్రామానికి, ఏ సొసైటీకి ఎంతెంత ఎరువు అవసరమో నిర్ణయించే అధికారం రైతులకే ఇవ్వవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను. లంకలు, అడవులు కొందరైన ప్రదేశాలలో Co-operative Societies ద్వారా రైతులకు ప్రోత్సాహమిస్తామని ప్రభుత్వంవారు చెలవిచ్చారు అదికూడా చాలమంచి విషయం. కాని ధనవంతులైనవారు కొందరు సొసైటీ సభ్యుల వెనకాల ఉండి ఆ లాభాన్ని అంతా వారు పొందుతున్నారు. అందుచేత సొసైటీలకు ఇచ్చినటువంటి concessions కల్పించామని మంత్రిగారు చెలవిచ్చారు. Society లకు concession కల్పించడం కాదు, నిరాధార స్థితిలో ఉన్నటువంటి వాళ్లకు నష్టం కలుగచేయడం

28th March 1956] [Sri G Narasimhamurthi

కంటే, సొసైటీలలో వెనకాలగా ప్రవేశించి పనిచేస్తున్నటువంటి ధనవంతులమీదను, చాటున ఉండి లాభాన్ని హరిస్తున్న వారిమీదను కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవడం మంచిది అని మనవి చేస్తున్నాను. అంతేగాక Society లకు భూములు ఇచ్చేముందు భూసంస్కరణలను త్వరగా అమలు జరపక పోయినట్లయితే Co-operative పద్ధతులలో వ్యవసాయం నిరుపయోగం అవుతోందనే సిద్ధాంతం మనలో ఉన్నది. భూసంస్కరణలు వచ్చే ముందే Societies చాల కట్టుదిట్టంగా సమర్థనీయంగా వ్యవహరించి జయప్రదం అవుతుందని నిరూపణ చేస్తే తప్ప రాబోయే భూసంస్కరణలు ఉపయోగకరంగా ఉంటాయని అనుకోవడానికి అవకాశం ఉండదు. కనుక society లను కులాలవారీగా ఏర్పాటు చేయకుండా ఆ గ్రామంలోని అనుభవంగల వాళ్లను, వారే కులం వారైనప్పటికి, అందరిని ఒక Society లోకి తీసుకొచ్చి వారందరిచేత తగిన తనిఖీలు చేయించి ఇది జయప్రదంగా ఉన్నదని వారికి నమ్మకం కలిగేలాగా చేస్తే ముందు రాబోయే భూసంస్కరణలలో ఈ విధానాన్ని అవలంబించడానికి తగిన ప్రోత్సాహం కలుగజేసినవారవుతారు. కనుక ఆ విధంగా తగిన చర్యలు తీసుకోవలసిందని మనవి చేస్తున్నాను. ఈ రాష్ట్రంలో అనేక రకాల Society లు ఏర్పాటు చేస్తున్నందుకు చాల సంతోషం. కాని వాటిలో అవినీతి, ధన దుర్వినియోగం జరుగుతున్నది. వీటన్నిటిని అరికట్టడానికిగాను కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవలసిందని నేను మనవి చేస్తున్నాను. ఉదాహరణకు Palm Jaggery Societies పెట్టారు. తాటి కల్లు సున్నపు కల్లు మొదలైన వాటినుంచి బెల్లం ఉత్పత్తి చేస్తున్నారు. ఈ బెల్లము మన దేశంలో ఆహార పదార్థం గనుక ప్రజోపయోగం కోసం వినియోగించవలసిందని వారు నిర్ణయించినారు. అయితే ఈ Society లను form చేసినవారు ఈ సున్నపు కల్లుకు బదులు త్రాగే కల్లును తయారు చేయించి వాళ్ల దగ్గర కొంత డబ్బు వసూలుచేసి కల్లు గీసినందుకు వారిమీద చర్యలు తీసుకోకుండా ఉండేందుకుగాను ప్రతి ఉద్యోగికి లంచం ఇస్తున్నారు. ఈ విధంగా మా ప్రాంతంలో అనేకం జరుగుతున్నాయి. ఇది ప్రభుత్వానికి చాల నష్టదాయకం. ప్రజలకు అరిష్టదాయకమైనటువంటిది. ప్రభుత్వ ఉద్యోగులు ఏమి చేసినా ఫరవాలేదనే ధైర్యం వాళ్లకు ఉన్నందువల్ల, ఇది అవినీతికి దారితీసి తద్వారా ప్రభుత్వాన్ని మోసగించి ప్రజలకు నష్టదాయకం అవుతున్నది. కనుక ఇటువంటి విషయాలను పరిశీలనచేసి విధిగా non-official Committee ఒకటి వేసి తనిఖీ చేయించవలసిందని మంత్రిగారికి మనవిచేస్తున్నాను.

Sri G. Narasimhamurthi] [28th March 1956

ముఖ్యంగా భూమి తనఖా బ్యాంకులు చాల ఉపయోగమైనటువంటివే. వీటిలో ఆలస్యం ఎందువలన జరుగుతోందో తెలియదు. మిత్రులు అప్పలస్వామి గారు చెప్పినట్లు 3 సంవత్సరాలు ఒక ఆసామికి అప్పు రాకపోయినట్లయితే ఎంత కష్టంగా ఉంటుందో ఆలోచించవలసి ఉన్నది. ఇటువంటి ఆలస్యం జరుగకుండా ఉండేందుకు తగిన విధానాలను అన్వేషించవలసిందని మంత్రిగారిని కోరుతున్నాను.

Sri P. VENKATASUBBAYYA :—అధ్యక్ష మహాశయా, భారత దేశంలో ఋణగ్రస్తులై బాధపడుతున్నటువంటి రైతులకు సహాయం చేయడానికి గాను 1904 వ సంవత్సరములో సహకార సంస్థల శాసనము ప్రవేశ పెట్టబడినది. ఆనాటి నుంచి అనేక మారులు ఈ శాసనం సవరణ కాబడింది. 1912 లో ఒకసారి 1928లో ఒకసారి, 1932వ సంవత్సరంలో మరొకసారి యీ శాసనం సవరింపబడింది. అయితే 1982 నుంచి ఈ 24 ఏండ్లుగా యీ శాసనం ఎటువంటి సవరణ చేయకుండా అలాగే ఉండిపోయింది. ఇప్పటి పరిస్థితులలో ఈ సహకార సంస్థలు అంతా విచారణచేసి సలహాలు ఇవ్వడానికిగాను All India Rural Credit Survey అనేటువంటి ఒక Survey Committee వేయబడింది. ఆ Survey Committee విచారణచేసి సమగ్రమైనటువంటి report ను Government కు కూడా పంపించింది. ఆ సవరణలో ఈ rural credit structure అనే అధ్యాయం క్రింద 115 నుంచి ఉన్నటువంటి సిఫార్సులు చాల ముఖ్యమైనవి. ఈ ముఖ్యమైనటువంటి సిఫార్సులను అమలుపరచాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. అందులో 119 వ సిఫార్సు చాల ముఖ్యమైనది. అది యేమిటంటే "The large sized Primary Agri-cultural, Credit Society should be established on the basis of a limited liability which may be confined to the value of shares held by them or preferably to a certain multiple thereof" అంటే, share పరిమితిని share capital కు పరిమితం చేయాలనిన్ని, 4, 5 వంతులు share అధికంగా ఉండినా ఫరవాలేదనిన్ని చెప్పబడింది. కనుక Co-operative Society లన్నింటినీ కలిపి ఒక పెద్ద Society గా ఏర్పాటుచేసి పరిమితంగల సంఘాలుగా ఏర్పాటుచేసినట్లయితే బాగా అభివృద్ధి కావడానికి అవకాశం ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈ సంఘాలన్నీ కూడా Co-operative move-ment కు ప్రాణాధారులవంటివి. పునాది సరిగా లేకపోయినట్లయితే పైన ఉన్నటువంటి structure అంతా కూలిపోతుంది. Co-operative Societies కనుక సరిగా పనిచేయకపోయినట్లయితే Central Bank గాని Provincial Bank గాని ఏ బ్యాంకు [illegible] అన్ని బ్యాంకులకు నష్టము వాటిల్లుతుంది. కనుక [illegible] [illegible] Co-operative Credit Society లు సమ

28th March 1956] [Sri P. Venkatasubbayya

గ్రంగా పనిచేయాలి అంటే ఈ సంఘాలన్నిటిని మూడు భాగాలుగా విభజించాలి. 500 జనాభా గలిగిన గ్రామానికి ఒక societyని స్థాపించాలి. ఈ co-operative Credit Societies ను సకలార్థ సహకార సంఘాలని అంటున్నారు. ఈ సంఘాలను మూడు భాగాలుగా భాగించాలి. అందులో ఒకటి Statistical Department. ఇది రైతులయొక్క budget అంతా తయారుచేయాలి ప్రతి రైతుయొక్క family budget ను తయారుచేసి అతనికి ఎంత ఆదాయం వస్తున్నది, ఎంత ఖర్చు పెడుతున్నది అతని credit capacity ఎంత ఉన్నది తెలుసుకోవడానికి ఈవిధంగా ఒక department ను పెడితే సంఘంలో ధనం దుర్వినియోగం కాకుండా ఉండడానికి రైతుయొక్క యోగ్యతనుబట్టి ఎంత అప్పు ఇవ్వవలెనో తెలియడానికి అవకాశం ఉంటుంది. కనుక ఇటువంటి Statistical Department ఒకటి ఉన్నట్లయితే సంఘాలు సమగ్రంగా పనిచేయడానికి అవకాశం ఉంటుంది. తరువాత, రైతులకు అప్పులు ఇవ్వడమే కాకుండా, వారికి కావలసిన సరుకులన్నీ కూడా Co-operative societies ద్వారానే supply చేయడానికి వీలుగా ఉండేటట్లు Co-operative store అనేది ఒక branch గా ఏర్పాటు చేసి ఈ మూడు భాగాలు కలిపి సకలార్థ సహకార సంఘంగా ఏర్పాటుచేసినట్లయితే ఈ సంఘాలు బాగా పనిచేయడానికి, రైతుకు కావలసిన వస్తువులు supply చేసి రైతులకు అప్పు ఇచ్చి మళ్లీ వాపసు తీసుకోవడానికి అవకాశం ఉంటుంది. ఆవిధంగా ఈ సంఘాలను పునర్నిర్మాణం చేసినట్లయితే సహకార సంఘాలు బాగా అభివృద్ధి కావడానికి అవకాశం ఉంటుందని మనవిచేస్తున్నాను. ఈ Co-operative administration చక్కగా జరగకపోవడానికి ఒక కారణము ఇది. అందులో audit శాఖకు Administrative శాఖకు సంబంధం ఉన్నది. Audit చేసేటటువంటి వాళ్లంతా కూడా administrative అధికారి అయిన Deputy Registrar of Co-operative Societies కి లోబడిన వ్యక్తులైన కారణమున వాళ్లు audit తప్పులను చూపడానికి భయపడుతున్నారు. ఆ కారణంచేత తప్పులను ఖచ్చితంగా నిరూపించ లేకపోతున్నారు. ఒకవేళ చెప్పినప్పటికిన్నీ, డిప్యూటీ రిజిస్ట్రారుగారు ఆడిటరును మీరు ఆడిటు చేసిరండి అని పంపుతున్నారు. అందువలన ఈ సంఘాలు దెబ్బతింటున్నాయి. అందువల్ల ముఖ్యంగా audit department ని ప్రత్యేకించి ఒక శాఖగా ఏర్పాటుచేసినట్లయితే ఈ సహకారసంఘాలు అభివృద్ధి కావడానికి అవకాశం ఉంటుంది. ఆవిధంగా చేయాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను.

[28th March 1956

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, ఈ సహకార సంఘాలు అనంత కోటి రూపాలతో, అనంతకోటి నామాలతో ప్రవర్తిస్తున్నాయిగాని, ఏ షావుకార్ల చేతుల్లోనో బడి, నిజంగా వడ్డీకివడ్డి వేసుకొని దిక్కు తెలియకుండా, అతిగతి లేని రైతులగురించి ఈ సహకారసంఘాలు ఏమైనా చేస్తున్నాయా అంటే, ఏమిలేదని చెప్పుతున్నాను. అయితే Land Mortgage Banks ద్వారాను, marketing societies ద్వారాను వారికి సహాయం చేస్తున్నామని మంత్రిగారు చెప్పవచ్చు. వీటిలోకూడా జాప్యము జరుగుచున్నది. దీంట్లో ఒక చిన్న మార్పు చేయవలెనని మాత్రము నేను కోరుతున్నాను. ఇప్పుడు Land Mortgage Bank కు encumbrance certificate తీసుకొనే విషయంలో దాదాపు 60 ఏళ్లవరకు పోతున్నారు. సాధారణంగా 12 ఏళ్లు అనుభవముంటే, హక్కు కలుగుతుందనేది ఎక్కడాకూడా జరుగుతున్నప్పుడు, ఇక్కడ ఈ 60 ఏళ్ల సాంప్రదాయము ఎందుకు వచ్చిందో నాకు అర్థంకావడంలేదు. అందువల్ల రైతులకు కష్టం కలుగుతుంది. కనుక అటువంటిదేమి లేకుండా, ఈరైతులకు, ఏవేవో అప్పులు, గవర్నమెంటు ఇచ్చేవి వ్యవసాయ అప్పులు మొదలగునవి అందరు ఇచ్చేదానికంటే, Co-operative Land Mortgage Bank ద్వారానే ఇప్పించి మిగతావాళ్లందరికి అప్పు ఇచ్చేది లేకుండాచేసి ఈ విషయంలో Revenue Department వారికి ఏమి అధికారము లేకుండా, వాళ్లు అప్పులుతీర్చకపోయినట్లయితే భూమిని అమ్మే అధికారముకూడ వీళ్ళేతీసుకొని, Marketing Societies ను, Land Mortgage Banks ను సమన్వయంచేసి, రైతుకు కావలసినటువంటి బాకీలు తీర్చుకొనే అవకాశము అంతా Land Mortgage Bank లే తీసుకొంటూ marketing సదుపాయాలు కలుగచేస్తే బాగుంటుంది. ఇప్పుడు ఉల్లిపాయలు, పసుపు మొదలైనటువంటివాటికి foreign market ఏదో కొద్దికొద్దిగా ఇస్తున్నారు. కాని అట్లు కాకుండా, రైతు పండించేటటువంటి సర్వసామగ్రికికూడ సంపూర్ణంగా marketing facilities చూపిస్తే రైతులు ఈ Land Mortgage Bank ద్వారా తీసుకొన్న అప్పులను తీర్చుకొని, ఋణవిమోచన చేసుకొని బాగుపడతారు. కాబట్టి Land Mortgage Bank ను, Marketing Societies ను సమన్వయపరచి, ప్రతి గ్రామంలోను ఒక Marketing Society పెట్టి, రైతు పండించేటటువంటి ప్రతివస్తువుకు marketing చూపించే బాధ్యతకూడ వాళ్ళే పెట్టుకొని, తద్వారా అప్పులు తీర్చుకొన్నట్లయితే, రైతులు బాగుపడుతారు. అందుచేత ఈ [illegible], 12, 13 ఏళ్లకుమాత్రమే encumbrance certificate తీసుకొని, [illegible] అప్పులు ఇచ్చి సహాయము చేయవలెనని కోరుతున్నాను. తరువాత ఈ

28th March 1956] [Sri B. Rama Reddi

Land Mortgage Banks కు కేవలం అనుభవం లేనటువంటి C. S. Rs. ను వేస్తున్నారు. ముఖ్యంగా మా ప్రొద్దుటూరిలో క్రొత్తవారిని వేసినారు. అనుభవం గలవారిని వేయవలసిందని ఎన్నో దినాలనుంచి చెప్పుకొంటున్నాము. కనుక కొంత అనుభవముగలవారిని అక్కడవేసి అప్పులు సత్వరంగావచ్చే సదుపాయము కలిగిస్తూ రైతుకు సహాయంచేయవలెనని మీ ద్వారా మంత్రిగారికి మనవిచేస్తూ విరమిస్తున్నాను.

Sri L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఈ Co-operative movement విషయంలో, సహకార సంఘాల అభివృద్ధి కొంతవరకు జరుగుతున్నా, ఎవరికోసమైతే ఈ సహకారసంఘాలు స్థాపించబడినాయో, వారి విషయంలో మాత్రం తగినంత అభివృద్ధి చెందలేదు అని మాత్రము నేను చెప్పటానికి విచారిస్తున్నాను. రైతులకు, గ్రామీణప్రజలకు ఈసహకార సంఘాలద్వారా credit facilities కల్పిస్తామని అన్నారు. కాని, ఇన్ని సంవత్సరముల తరువాత, ఈ సహాయము ఇప్పుడు ఎంత జరుగుతున్నది అని లెక్కవేసినట్లయితే, 3.7 per cent కు వచ్చినాము అంటె, రైతులకు ఎంతవరకు credit facilities ఈ సహకార సంఘాలు ఇస్తున్నారో ఊహించుకోవచ్చును. 5 per cent అని అంటున్నారు. 5 per cent అయినా, అది ఒక పెద్ద సంఖ్యకాదు. రైతాంగానికి ఇతరత్రా ఏ విషయంలోకూడ, ఏ banks లోకూడ credit అనేది లేకుండా ఉండే పరిస్థితులలలో ఒక్క సహకార సంఘాలద్వారా 5 per cent ఈ సహాయము చేస్తున్నాము. అందుచేత ఈ విషయములో ప్రభుత్వము ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొని మొట్టమొదట ఏ ఉద్దేశముతో అయితే Co-operative movement అనేది సృష్టింపబడిందో దాన్ని గురించి ప్రయత్నంచేసి, రైతులకు కనీసం మాటికి 50, 60 రూపాయలు బ్యాంకులద్వారా వచ్చేటట్లుగా చేయవలసియుంటుంది. Rural banks పెట్టమని అన్నారు. అంతేకాదు, ఒక 5 మైళ్లుగాని, 10 మైళ్లుగాని విస్తీర్ణము తీసుకొని అక్కడ ఉన్న share ధనాన్ని అంతా కలుపుకొని, ఇంక ప్రజలలో ఉత్సాహం కల్పించి దానికి ధనము వచ్చేటట్లు చేయవచ్చును. తరువాత ఈ నాడు సహకార banks లో వేస్తున్నటువంటి deposits District Boards వి గాని లేకపోతే మునిసిపాలిటీలవి గాని, ఇంకా ఇతరసంస్థలనుంచిగాని తీసుకొనివచ్చి co-operative సంస్థలలో వేయడంలేదు. ఎందుకు వేయకుండా ఉన్నారు అనేది ప్రభుత్వము గమనించాలని నేను మనవిచేస్తున్నాను. నేను Co-operative Central Bank లో Vice-

Sri L. Lakshmana Das] [28th March 1956

President గా 5, 6 సంవత్సరములుగా చూస్తున్నాను. మాకు ఈ marketing societies ద్వారాను, ఇతరత్రా 2, 3 లక్షల రూపాయలు నష్టము వస్తూన్నదేగాని, credit మూలకంగా వచ్చేనష్టము చాలాతక్కువ. అందుచేత ఈ బ్యాంకులను ఇతర వ్యాపారంలో పెట్టినట్లయితే, నష్టంవచ్చి, ఆ bank వల్ల 'C' Category కి వచ్చి దానికి ఒక credit లేకుండాపోయి, బీద ప్రజలు బాధపడేపరిస్థితులు సంభవిస్తాయనే విషయము ప్రభుత్వము తెలుసుకోవలసి యున్నదని మనవి చేస్తున్నాను. కనుక, మనము ప్రధానంగా, ఈ గ్రామీణ ప్రజానీకానికి, రైతులకు అప్పుఇచ్చే తగినసౌకర్యాలుఇచ్చే విధానాన్నే చూడ వలసియున్నది దానికి ఈ Rural bank లే శరణ్యము, అని నేను భావిస్తున్నాను. అందుచేత ప్రభుత్వము ఈ Rural banks పెట్టే విషయంలో వారిని నేను అభినందిస్తున్నాను ఈ Rural banks కేవలం అడక్కడనుంచి volunteer గా వచ్చే పద్ధతిలో కాకుండా, ప్రభుత్వమే చర్యతీసుకొని పదిమైళ్లకొకటి పెట్టిస్తే బాగుంటుంది. దానికి అభ్యంతరముండదు. పదిమైళ్ల విస్తీర్ణానికి ఒకటిపెట్టి, ఈ bank అభివృద్ధి పొందాలంటే, ఈవేళ ఉన్నటువంటి private lending అనేది రద్దుచేయ వలసియుంటుంది. ఈ private lending ను రద్దుచేస్తేనేగాని Co-operative సంస్థలద్వారా వీరు అభివృద్ధిపొందలేరని నేను మనవిచేస్తున్నాను. కనుక private lending ను పూర్తిగా నిషేధించండి ఈనాడు private lenders ఇస్తున్నధనము వల్ల రైతులు ఎవరూ బాగుపడడంలేదు. వారు సర్వనాశనం అవుతున్నారని మాత్రము మనవిచేస్తున్నాను. కనుక ఈ పద్ధతిని పూర్తిగా రద్దుచేసి, సహకార పద్ధతి ఏ విధంగా చేయాలి అనే విషయంగురించి, అనుభవమున్నవారందరిని సమావేశపరచి, వారి సలహాలు తీసుకొని ఈ Act ను తగినవిధంగా మార్పుచేయాలని మంత్రిగారిని కోరుతున్నాను. క్రిందటి 3, 4 సంవత్సరములు అనుభవమున్న మంత్రి గారు ఈ విషయములో తగినచర్య తీసుకోగలరని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA :—అధ్యక్షా, ఈ పద్దుపైన దరిమింది గౌరవసభ్యులు పాల్గొన్నారు. వారందరుకూడ సరిఅయినటువంటి, చాలా లాభదాయకమైనటువంటి సలహాలు ఇచ్చిఉన్నారు. వాటన్నింటికికూడ సమాధానము చెప్పలేకపోయినా ప్రధానముగా వున్నవాటికి మాత్రం సమాధానము చెప్తూను, మిగతావాటినికూడ తప్పకుండా పరిశీలించి తగువైనచర్య తీసుకొంటానని నేను హామీ ఇస్తున్నాను. ముఖ్యంగా ఈ Co-operative Societies కు

సంబంధించినటువంటి చట్టము 1932 నుంచి ఇప్పటివరకు, షుమారు 24 సంవత్సరములుగా, సవరించబడకుండా ఉన్నది అనేది ప్రధానంగా కన్పిస్తున్నది. ఈలోగా ఎన్నో మార్పులు వచ్చాయి. ఎన్నో ఇబ్బందులను, అసౌకర్యాలను ఎదుర్కొంటున్నాము. అటువంటి సందర్భంలో ఈ చట్టాన్ని సవరించడం చాలా ప్రధానమైనటువంటి విషయము, దీన్ని వెంటనే సవరించాలని చాలామంది సూచించారు. ఈ సభలోనే కాకుండా, బయట అనేకచోట్లకూడ ఈ విషయంగురించి చెప్పుతున్నారు. ఈ చట్టాన్ని సవరించడానికి కావలసినటువంటి ఏర్పాట్లు జరుగుతున్నాయి. దీనికి ఒకబిల్లు అప్పుడే తయారైంది. అయితే, ఇంకా కొంత దానిని పరిశీలనచేసి, ఇంక Co-operative Advisory Board వారియొక్క, Central Bank Presidents యొక్క, ఇంకా సహకార ఉద్యమంలో అనుభవంగల వారియొక్క అభిప్రాయాలుకూడ సేకరించి, దీన్ని ఇంకా ఏ విధంగా మార్పుచేయాలో అదంతా చూసి చేస్తామని అనుకొంటున్నాము. ఈ చట్టాన్ని సవరించేటప్పుడు, సహకార సంఘాలలో ఎవరైనా సభ్యులుగా చేరడానికి సంసిద్ధంగా ఉన్నట్లయితే, ఆ సహకారసంఘాలకు సంబంధించినటువంటి సర్వసభ్య సమావేశాలు అది నిరాకరించినట్లయితే, వారిని చేర్చుకోడానికి వీలులేదు, అనే విషయముకూడ జాగ్రత్తగా చూడాలి. ఎట్లయినావారిని చేర్పించడానికి ప్రయత్నం చేసేటటువంటి మార్గాలు మనం అన్వేషించాలి అని కొంతమంది అన్నారు. కాని, నిజంగా వారు మంచివారో చెడ్డవారో అనేది తెలుసుకోకుండా, అందరిని చేర్చుకోనేపద్ధతి సరిఅయినదికాదు, దాన్ని జాగ్రత్తగా పరిశీలించాలని మరి కొంతమంది చెప్పినారు ఈ విధంగా పరస్పర విరుద్ధము కలిగినటువంటి సూచనలుకూడ వచ్చినాయి. ఏమైనా, దానికి చట్టాన్ని సవరించవలసిన అవసరంలేదు. ఈ సహకార సంఘాలలో వారిని సభ్యులుగా చేర్చుకోనేవిషయంలో bye-laws మార్పుచేయవలసి ఉంటుందని అనుకొంటాము, కనుక bye-laws మార్పుచేసి ఆ విధంగా వారిని చేర్చుకోడానికి అవకాశాలు కల్పించాలని నేను అనుకొంటున్నాను.

ఈ పద్దుమీద మొట్టమొదట, సత్యనారాయణరాజుగారు మాట్లాడినారు. వారు చాలా అనుభవం కలిగినటువంటివారు. అనేకవిషయాలు వారు చెప్పారు. రైతులకు ఎరువులను సరఫరాచేసే సందర్భంలో, అది కేవలం సంపూర్ణంగా ఈ సహకారసంఘాలకే అప్పగించడం మంచిదని వారు అన్నారు. దానికి చాలా సంతోషము. అది చాలా మంచిదనుకొనే మేమంతాకూడా ప్రభుత్వములో ఉంటే మంత్రులందరుకూడ కూర్చొని ఆవిధంగా ఏర్పాటుచేశాము అయితే అది సక్రమముగా నడిచేపద్ధతి మనము ఏర్పాటుచేసుకోవాలనుకొంటున్నాను. ఎందుకంటే

Sri D. Sanjivayya] [28th March 1956

tender firms అనేటటువంటివారు ఉన్నారు. కొన్నిచోట్ల Co-operative Stores వారు దీన్ని సరఫరాచేస్తూ ఉండినారు. Tender firms వారికి అధిక లాభాలు పోతున్నాయి. ఆ లాభాలన్నీ సహకారసంఘాలకు ఇచ్చినట్లయితే బాగుంటుంది. Tender firms కు వచ్చేలాభాలు ఏ ఒక్క వ్యక్తో అనుభవిస్తాడు. సహకారసంఘాలకు ఇచ్చినట్లయితే, ఆ సంఘాల్లో ఉండే సభ్యులందరుకూడ ఆ లాభాన్ని అనుభవించడానికి అవకాశముంటుంది. పదిమంది మేలుకోసం, ఒకరి మేలు చూడవలసిన అవసరంలేదని, Tender firms కు ఇవ్వడం తీసివేసి, ఇప్పుడు ఈ సహకారసంఘాలకు ఈ సరఫరా వ్యవహారమంతా ఇచ్చాము. అయితే ఈ సందర్భంలో ఒకటిమాత్రము మనవిచేయవలసియుంటుంది. కొన్నిచోట్ల ఈ సహకారసంస్థలలో, కొందరు అవి వాళ్ళతాతలు కట్టించిన సంస్థలుగానో, లేక పిత్రార్జితంగా వచ్చినటువంటి సంస్థలుగానో భావిస్తూ, ఆ సంస్థలంతా monopoly-గా చేస్తున్నారు. ఏ పదిమందినో తమక్రింద ఉన్నటువంటివాళ్లను ఆ సంస్థలో పెట్టుకొని ఇతరవాళ్ళను చేర్చుకోకుండా ఆ పదిమందిలోనే ఎప్పుడు తాము Directors గాను, Chairmen గాను elect అవుతూ, వచ్చే లాభాలన్నీ జేబులో వేసుకొనే పెద్దమనుష్యులు ఉన్నారు. అటువంటివారందరిని ఇప్పుడు ఈ శాసనసభద్వారా హెచ్చరిస్తున్నాము.

అనేకసార్లు రామారెడ్డిగారు ఉత్పత్తిదార్లు ఉల్లిపాయలు, మిర్చివర్తకాలు export చేయటానికి మార్కెటింగు సొసైటీలకు పర్మిట్లు యివ్వాలని అన్నారు. ఉత్పత్తిదార్లతోకూడిన సొసైటీలవారికి అన్నమాట. ఇటువంటివారికి Producers Co-operative Societies అని ఏర్పాటుచేయబడినవి. ఈ Society Presidents కు సొసైటీతరఫున ఉల్లిపాయలు, మిర్చి, యింకా యితర Agricultural produce లను export చేయటానికి పర్మిట్లు సంపాదించి యిస్తే, ఆ పర్మిట్లు జేబులో పెట్టుకుని మద్రాసు హార్బరులో exporters ఉంటే, అక్కడికి పోయి వారికి ఆ పర్మిటుకాగితమాయిచ్చి 20 వేలు, 30 వేలు చాటుగా తీసుకొని జేబులో పెట్టుకునివచ్చిన పెద్దమనుష్యులుకూడ ఉన్నారు. ఈ విషయము ప్రభుత్వము నోటీసుకువచ్చింది. దానిమీద ప్రభుత్వము చర్యతీసుకుంటున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :— వారి పేర్లు ప్రకటిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA:— పేర్లు ప్రకటించడము మంచిది కాదు. ప్రభుత్వము కేసుపెట్టి విచారణచేయిస్తున్నది. ఫలానావారు అని తెలిస్తే,

వారు వెళ్ళి ఎవరినో పట్టుకుని influence చేసి, కేసునుంచి తప్పించుకోటానికి ప్రయత్నిస్తారు. అప్పుడు ప్రభుత్వము పెట్టిన కేసు, దానియొక్క విచారణ అంతా వృథా అయిపోతుంది. కాబట్టి పేర్లు నేను యిప్పుడు చెప్పదలచలేదు. దీనివల్ల ఆ సహకారసంస్థకు ఎంతలాభము వచ్చేదో చెబుతున్నాను. ఒకటన్నుకు నాలుగు రూపాయలు చొప్పున ఒక పదిలక్షల టన్నులకు నలభైలక్షలు వస్తుంది. ఇందులో 10, 15 లక్షలు ఖర్చులక్రింద పోయినాగూడ, నికరముగా 20 నుంచి 25 లక్షల దాకా లాభము వస్తుంది. ఈ విధమైన లాభము మన సహకారసంస్థలకు వస్తుందనే ఉద్దేశ్యముతోనే, ప్రభుత్వం పర్మిటు తెప్పించియిస్తే, అది దుర్వినియోగముచేశారు. ఇప్పుడు అది రాకుండాపోయింది. పెద్దమనుష్యులైనవారిచేతులలో సహకారసంస్థలు పెట్టుకోవడం, తరువాత, యీ విధముగా mismanage చేయడము అంటే, సహకారంసంస్థలు చెడిపోవడముతప్ప వేరేమీలేదు. వాస్తవముగా యీ సంస్థలను ఎక్కువశ్రద్ధతో స్వార్థరహితముగా అభివృద్ధిలోనికి తెచ్చేవారిచేతులలో ఉంచితేనే అవి ముందుకురాగలవు గాని, యీనూదిరి స్వార్థపరులైన పెద్దమనుష్యులచేతులలో యీ సంస్థలు బాగుపడుతాయా, అంటే, అవి బాగుపడవని నా దృఢనమ్మకము. పెద్ద మనుష్యులని అనిపించుకుంటున్నవారు సంఘ శ్రేయస్సు కోరక యీ విధముగా దుర్వినియోగము చేశారు ఎప్పటికైనా, సంఘశ్రేయస్సు కోరేవారే యీ సంస్థలను చేబట్టాలి. అప్పుడు సహకారసంస్థద్వారా వచ్చేలాభాన్ని అందరికీ అందజేయాలనే ఆదర్శప్రాయమైనపద్ధతిలో యీ సంస్థలను నడిపిస్తామని నేను ఆశిస్తున్నాను.

తరువాత చేనేత ఉద్యమాన్నిగురించి ప్రగడకోటయ్యగారు, సత్యనారాయణ గారు మాట్లాడుతూ, యీ ఉద్యమానికి ప్రభుత్వము సహాయపడాలి అని చెప్పారు. ఈ విషయములో రాష్ట్రప్రభుత్వమే కాకుండా కేంద్రప్రభుత్వముకూడ ఆలోచనలు చేస్తూనే ఉన్నది. ఇంతకుపూర్వము ప్రభుత్వము తీసుకున్న చర్యలద్వారా యీ చేనేతవర్గమువారియందు ప్రభుత్వము ఏవిధముగా సానుభూతి సహకారము చూపుతున్నదో బోధపడుతూనే ఉన్నది. Cess fund విధానము అందరికీ తెలిసిన విషయమే. Cess fund ద్వారా వివిధంకాలుగా మెంబర్లను చేర్చుకోటానికి అవకాశాలు కల్పిస్తున్నాము. తరువాత improved methods of dyeing విషయములోకూడ ఎక్కువ అవకాశాలు కనిపిస్తున్నవి. ఏమైనప్పటికిని Central Banks వారు యీ చేనేత సహకార సంఘాలకు తగినరీతిగా ప్రోత్సాహించటము లేదు, సమయానికి అప్పులు యివ్వడము లేదు, ఒకవేళ ఇచ్చినను, అది చాలా కాలము పట్టుతుందని అంటున్నారు. ఈ విధమైన ఆరోపణ చాలా కాలముగా ఉంటున్నది. ఈ కారణముచేతనే వారికి ఒక Financial Corporation

ఏర్పాటుచేయమని కోరుతున్నారు. ఈ మధ్య నేను, పరిశ్రమల మంత్రిగారు యీ విషయమును గురించి ఆలోచించాము. మేము యీ Cess fund లో నుంచి కొంత ధనాన్ని యీ Corporation క్రిందకు వుపయోగించటానికి వీలు అవుతుందేమోననే ఉద్దేశ్యముతో కేంద్రప్రభుత్వానికివ్రాసి అనుమతి తెప్పించి యీ Corporation ను ఏర్పాటుచేయాలని అనుకున్నాము. ప్రగడ కోటయ్యగారు మాట్లాడుతూ మాకు యీప్రభుత్వముగాని కేంద్రప్రభుత్వముగాని ఆర్థికసహాయము చేయనక్కరలేదు, మాకు మేమే ఏర్పాటుచేసుకుంటాము, దానికి కావలసిన అధికారము, సిబ్బందిని యిస్తేచాలు అన్నారు. దానికి ప్రత్యేకంగా ఒక Special Officer ను వేస్తే, ఆయనద్వారా యీ Corporation ను నడిపించుకుంటాము, అందుకు అనుమతి యివ్వమనికోరారు. ఈవిధానము ప్రభుత్వానికిగూడ సులభముగానేఉన్నది. అందుకు ప్రభుత్వానికి ఏలాంటి అభ్యంతరములేదు ఆవిధంగా కాకుండా ప్రభుత్వమునుంచిగూడ ఏపది పదిహేనులక్షలో 20 లక్షలో ఆకార్పొరేషనుకు కావాలని అడిగితేమాత్రము ఆ విషయము ఆలోచించవలసి యుంటుందికాని, ప్రభుత్వమునుంచి ధనసహాయము కోరకుండా సిబ్బంది సహాయముచేయమంటే, దానికి మాకేమి అభ్యంతరములేదని అంటున్నాను.

SRI P. SATYANARAYANA :—రాష్ట్రములో యిప్పుడు సుమారు 650 సొసైటీలు ఉన్నవి. ఈ సొసైటీలలో ఉండే Reserve Fund మాత్రము pool చేసియిస్తే, అదే ఎంతో అవుతుంది. అదియిస్తే చాలు

THE HON. SRI D. SANJIVAYYA :—సొసైటీలలో ఉన్న Reserve Fund మాత్రమే కాదు. ఇంకను Central Banks లో సుమారు నాలుగైదు లక్షలదాక సొసైటీల డబ్బు ఉన్నది. దానినిగూడ తీసుకోవచ్చు. కాబట్టి సభ్యులు కోరేమాదిరిగా ఏర్పాటుచేయటానికి ఎలాంటి అభ్యంతరముూలేదు. కాని ఒక సంగతి మాత్రము మనవిచేస్తున్నాను. ఒకేసారి, పెద్దపెట్టున యీ సంస్థను పెద్దదిగా ఏర్పాటు చేయలేము. ముందు చిన్నదిగానే ఆరంభించి, తరువాత కాలముజరిగిన కొద్ది, అందులోని సాధకబాధకాలు గుర్తించి, పెద్దదిగా పెంపొందించుకోవలసిందిగా కోరుతున్నాను. Let us make a humble beginning. కాబట్టి ముందు ఏనలభై యాభైలక్షలతో ఒక చిన్నకార్పొరేషను ప్రారంభించి, దానిని క్రమేణావృద్ధిచేసుకుంటే, అది వృద్ధిచెందే అవకాశము ఉంటుంది. ప్రభుత్వం యీ విషయముమీద త్వరలోనే ఒక నిర్ణయము తీసుకొని, వచ్చేపదిహేను రోజులలోనో లేక ఒక

28th March 1956] [Sri D. Sanjivayya

నెలలో పురాణో ఒక Special Officer ను వేయటానికి సిద్ధముగా ఉన్నదని సభ్యులకు మనవి చేస్తున్నాను.

తరువాత యితర సొసైటీలు కొన్ని ఉన్నవి. Fishermen's Co-operative Societies, Forest Coupe Societies, Contract Societies ఉంటున్నవి. వీటినిగురించి general గా యిందులో ద్వంద్వ ప్రభుత్వ విధానము ఉంటున్నదని ప్రగడ కోటయ్యగారు, మంతెన వెంకటరాజు గారు యింకా యితర మిత్రులు అన్నారు. ఏ సొసైటీ అయినప్పటికీ, అది Co-operative Department ద్వారా స్థాపించబడింది. కాబట్టి, దానికి Co-operative Department కు సంబంధము ఉండకతప్పదు. ఇదిగాక యిప్పుడు Forest Coupe Society అనేది ఉంటే, అది Forest Dparment వారివద్దకు వెళ్ళి, అక్కడ coupes కొరకు కొంత భూమిని సంపాదించాల్సి ఉన్నది. అట్లాగే Labour Contract Society ఉంటే, అది మునిసిపాలిటీల దగ్గరకో, లేకపోతే District Board Engineer వద్దకో వెళ్లవలసి ఉంటుంది. అదే విధముగా Fishermen's Co-operative Society ఉంటే, అది Fisheries Department వద్దకువెళ్లి కొన్ని పనులు ఆ డిపార్టుమెంటు ద్వారా చేయించుకోవలసి ఉంటుంది Tenants Co-operative Society ఉంటే, అది Revenue Department ద్వారా కొంత భూమిని సాగుకు తీసుకోటానికి, వారి అనుమతి పొందటానికి, వారి వద్దకు వెళ్ళవలసి ఉంటుంది. అయితే ద్వంద్వము అనేది లేకపోలేదు. కాని ఆయా సొసైటీలు ఆయాపనులు కోసము, దానికి సంబంధించిన డిపార్టుమెంటు వద్దకు వెళ్లక తప్పదు. ఆయా డిపార్టుమెంటువారు అనుమతి యిస్తేగాని ఆయా సొసైటీల పనులు కావు. అందువల్ల యిటు Co-operative Department తోనూ, అటు ఆ Concerned Department తోను సంబంధము ఉండక తప్పదు. ఈ విధముగా ఉండడమువల్ల, పనులలో ఆలస్యము జరగడము, పనులు కాకపోవడము, యిలాంటి యిబ్బందులు ఉంటున్నవి, వాని తొలగించాలని సభ్యులు అంటున్నారు. యీ విషయములో ద్వంద్వము అనేది లేకుండా ఒక డిపార్టుమెంటు జిల్లా స్థాయిలో ఏర్పాటుచేసి, అందులో various Departmental District Officers కు సంబంధము ఉండేటట్లుగా ఏర్పాటు చేయాలని, అంటున్నారు. ప్రతి ఒక్కసారికూడ జిల్లాలో వారి సమావేశము అయ్యేటప్పుడు Forest Coupe Societies లకు యివ్వటానికి యిన్ని coupes ఉన్నవి అని Forest Officer చెప్పటానికి వీలుఅవుతుంది. ఇంత భూమి కౌలుకు యివ్వటానికి వీలవుతుందని Revenue Divisional Officer చెప్పవచ్చును. ఈ

Sri D. Sanjivayya] [28th March 1956

విధముగా ఆయా Departmental District Officer తన డిపార్టుమెంటుకు సంబంధించిన భోగట్టాను యివ్వవచ్చు అనేది ఒక చక్కని సలహా సభ్యులుయిచ్చారు. వ్యవహారములుకూడ ఎప్పటికప్పుడు పరిష్కారము కావటానికి వీలు అవుతుందనికూడ అంటున్నారు. నిజమే ఈ సలహా బాగానే ఉన్నది. ఈ సలహాను ప్రభుత్వము తప్పకుండా ఆలోచించి చేస్తుందని సభ్యులకు హామీ యిస్తున్నాను తరువాత యింకొక విషయము మనవి చేస్తున్నాను. సహకారోద్యమము గ్రామీణ ప్రాంతాలలో బాగా ప్రాకి పోవడమేకాకుండా, ప్రతి కుటుంబము వారుగూడా ఏదో ఒక సంఘము అనేది ఏర్పాటుచేసుకుని, సభ్యులుగా చేరడము తటస్థిస్తున్నది. వారు ఏదో విధముగా యీ ఉద్యమము ద్వారా సహాయమును తీసుకుంటున్నారు. కాని యిందులో చాలా చిక్కులు ఉన్నవని పప్పూరు రామాచార్యులుగారు చెప్పారు. ఈ సొసైటీలను limited గా ఏర్పాటు చేయలేదు. Unlimited అనేదిగా ఉండడమువల్ల, సొసైటీలోని ఏ ఒక్క మెంబరు అయినా సొసైటీ తరఫున తెచ్చిన అప్పులు యివ్వకపోతే, సొసైటి unlimited గా ఉన్న కారణమున, ఆ సభ్యుడు చెల్లించవలసిన అప్పు అంతా, మిగతా సభ్యులమీద పడుతుందనే భయము సభ్యులలో ఉన్నది. అందువల్లనే చాలా మంది యీ సొసైటీలలో చేరడములేదు. చేరటానికి భయపడుతున్నారు. కాబట్టి యీసొసైటీలు limited చేస్తే బాగా ఉంటుందని రామాచార్యులు గారు అన్నారు. ఇదిగాక గ్రామాలలో పార్టీ దృక్పథముతో, యితర పార్టీల వారిని సొసైటీలలో చేరనివ్వడము లేదు అని గూడ వారు అన్నారు. ఇది నిజమే అయితే కావచ్చు. కాని యిప్పటికి యాభై సంవత్సరములుగా యీ ఉద్యమము పనిచేస్తున్నదనే సంగతి అందరికీ తెలిసినవిషయమే. ఈ ఉద్యమము గ్రామ గ్రామాలలో ఎంతో విస్తరించి పోయింది. ఈ ఉద్యమము యొక్క సిద్ధాంతము ప్రకారము కుల, మత, జాతి విచక్షణ లేకుండా నడపవలెననే ఉన్నది. ఇందులో party politics కు ఏ మాత్రము చోటులేదు. అందరుకూడ చేరవచ్చుననే ఉన్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇది అంతా నిజమే. ఒకే పార్టీలో ఎన్నో group politics ఉంటున్నవే. అవి prevent చేయటానికి మార్గాలు ఏమైనా ప్రభుత్వము ఆలోచించిందా?

THE HON. SRI D. SANJIVAYYA :—అదేకదా చెబుతున్నాను. ఇందులో కులమతజాతి విచక్షణకు చోటులేదనే చెప్పాను. అవి లేవనే అనుకుంటున్నాను. ఒకవేళ అటువంటివి ఏమైనా ఉంటే, అవి ప్రభుత్వముయొక్క దృష్టికి తీసుకువస్తే, అవి సాధ్యమైనంతవరకు సామదాన భేదదండోపాయముల

చేత, నివారించటానికి ప్రయత్నము చేస్తాము. కాని చట్ట రీత్యా మాత్రము చేయుటానికి అవకాశములులేవని నేను ముందుగానే మనవిచేశాను. ఇంకా ఏమైనా వీలు చేయాలంటే సొసైటీ bye-laws ను amend చేసి, admission కు మరింత ఆస్కారము ఉండేటట్లు చేసుకోవచ్చును. ఈ విషయములో మాత్రము ప్రభుత్వము శ్రద్ధ వహించి చర్యతీసుకుంటుంది. అయితే ఒకే గ్రామములో ఒక విధమైన సొసైటీ ఉంటే, అదేమాదిరి సొసైటీ అదే గ్రామములో ఉండడమనేది అంతగా సమంజసముకాదని నా అభిప్రాయము. కాని రెండు సొసైటీలు ఉంటే ప్రమాదము లేదని ప్రగడకోటయ్యగారు యింకా యితరులు యీ ఉద్యమములో అనుభవము గలవారు చెబుతున్నారు కాని, నా ఉద్దేశ్యములో మాత్రము ఒకే గ్రామములో ఎన్ని పార్టీలు ఉన్నవో అన్ని సొసైటీలు ఒకే purpose కొరకు ఏర్పాటు చేసుకోవడము మంచిదికాదేమోనని అనుకుంటాను. ఒక గ్రామములో ఒక purpose కొరకు ఒక సొసైటీని ప్రారంభించి, అదే purpose కొరకు ఆ గ్రామములో యింకొక సొసైటీ స్థాపించడము అనేది వచ్చినప్పుడు, యింకా యితర పెద్దలను ఆలోచించి, వారి సలహాలను తీసుకుని ఏర్పాటుచేస్తే బాగా ఉంటుందని నా అభిప్రాయము. అది యీ co-operative సంస్థలను గురించిన సిద్ధాంతాలను సవరించేటప్పుడు ఆ విషయమును గురించి ఆలోచించవచ్చును.

తరువాత రాష్ట్రములో గృహ నిర్మాణ సహకార సంఘాలద్వారా అప్పులు యిచ్చి యిళ్లు కట్టిస్తున్నారు, కాని యిది పేదలకు ఉపయోగకరముగా లేవని డోళ్ల అప్పలస్వామిగారు, బత్తిన సుబ్బారావుగారు అన్నారు. ఈ సంఘాల ద్వారా భాగ్యవంతులకు 10, వేలు, 15 వేలు అప్పులు లభిస్తున్నవి. వారు తద్వారా ఇళ్లు కట్టుకోగలుగుతున్నారు. షేరు ధనము క్రింద, మూడు వేలు, నాలుగు వేలు కట్టుకోగల శక్తి వారికి ఉన్నది గనుక వారికి అప్పులు లభిస్తున్నవి. షేరు ధనము కట్టలేని పేదవాళ్లు, హరిజనులు ఉంటూంటే, వారి పరిస్థితి ఏమిటి అని అడుగుతున్నారు. కాని నేను యీ విషయములో ఒక్కటే సంగతి మనవిచేస్తున్నాను. పేదవాళ్లు, హరిజనులు షేరు ధనము కట్టలేరు గనుక, వారికి షేరు ధనముకూడ అప్పు యిచ్చి యిళ్లు కట్టించే పద్ధతి సహకార సంస్థల పద్ధతికాదు. సహకార సంస్థలు పని చేయవు. హరిజనులకు, యింకా వెనుకబడిన జాతులవారికి గృహ నిర్మాణము సాగించాలంటే కేవలము మొదలునుంచి చివరవరకు అప్పు విధానముతో సహకార సంస్థలు సాగించటానికి అవకాశములులేవు. ఇంకా వీలుగా ఉంటే, కొంత subsidy రూపములోనూ, కొంత loan రూపములోనూ సాగించవచ్చుగాని, కేవలము అంతా అప్పుగానే యివ్వండి అని అంటే, అది అయ్యే పనికాదు. ఆ విష

Sri D. Sanjivayya] [28th March 1956

ముగా చేస్తే, ఇచ్చిన అప్పులు తిరిగి వసూలు కావు. వారు కట్టుకోలేని స్థితిలో ఉంటారు. కాబట్టి యిది ప్రయోజనములేదు. ఇప్పుడు బొజ్జా అప్పలస్వామిగారు మెంబరుగా వచ్చారు. నేను యిక్కడ మంత్రిగా వచ్చాను. వారికి జీతము రూపేణ కొంత వస్తుంది. నాకుకూడా ఏదో జీతము వస్తున్నది. కాబట్టి మేము ఏదో కొంత సొరు ధనము కట్టుకొని యిళ్ళను నిర్మించుకోగలము. ప్రతి నెలకూడ ఏదో కొంత జీతము వస్తుంది కాబట్టి అందులోనుంచి నెలనెలకు అప్పు తీర్చగలము. ఇటువంటి వారికి 5 వేలో, 6 వేలో అప్పులు యివ్వడానికి వీలు ఉంటుంది. అప్పులు తీసుకుని యిళ్లను కట్టించుకోవచ్చు. కాని కేవలము యేవిధమైన ఆధారము లేనివారికి అప్పులు యిస్తే వసూలు కావు సహకార సంస్థలు దెబ్బతింటాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పేదవాళ్లకు ఉచితముగా డబ్బు ఇచ్చి యిళ్లు కట్టించే ఏర్పాటుఉన్నది. అందులో కొన్ని లక్షలు కేటాయించాము ప్రతీ జిల్లాలోనూకూడ కొన్ని యిళ్లు తయారు అవుతాయి. అవి పేదలకోరకేనని మనవిచేస్తున్నాను.

గౌరవసభ్యులు రామారెడ్డిగారు ఈ Land Mortgage Banks లో ఆలస్యం జరుగుతోందని చెప్పారు. ఆ ఆలశ్యాన్ని నివారించడానికి మేము శ్రద్ధ తీసుకుంటున్నాం. ఒక conference పెట్టామని నా opening remarks లో చెప్పాను. ఆ సమావేశంలో రామారెడ్డిగారుకూడా ఉన్నారు. అందువల్ల త్వరగా ఆ విషయంలో ఉత్తరువులు జారీచేయబడతాయి. దాంట్లో ఏమీ ఆలస్యం జరగదని మనవిచేస్తున్నాను. రైతులకు అప్పులు కేవలం Land Mortgage Banks ద్వారానే ఇప్పించడం మంచిదే — మిగతా సంస్థలేమీ లేకుండా—అనే సలహా కూడా రామారెడ్డిగారు చెప్పారు. అది చాలా చక్కనిసలహా. దానిని నే నంగీకరిస్తున్నాను. లక్ష్మణదాసుగారు మాట్లాడుతూ Central Banks ఇతర సంస్థలకు అప్పులిచ్చేటటువంటి విధానంవల్ల చెడిపోతున్నాయి. కేవలం Credit Societies కి ఇస్తే దానికేమీ అభ్యంతరంలేదు, అందువల్ల Rural Banks ని మీరు ఎక్కువగా ఏర్పాటుచేస్తే స్థానికంగా ఉండేటటువంటి అవసరాలు తీర్చడానికి అవకాశం ఉంటుంది అన్నారు. ఇప్పటికి దాదాపు 10 కి పైగా Rural Banks register ఐనాయి. ఈ ప్రాంతంలోకూడా కొత్తబ్యాంకులు రావడంలేదు. 50 వేల రూపాయిలు వసూలుచేస్తేనేగాని ఈ బ్యాంకులు register చేయడానికి అవకాశంలేదని అంటూండేవారు. కాని 25 వేల రూపాయిలైనాసరే ఒక్క Rural Bank ను register చేయవచ్చునని ప్రభుత్వం ఉత్తరువులిచ్చిన కారణంచేత ఈ వెనుకబడినటువంటి ప్రాంతాలకుకూడా ఈ Rural Banks

register కాబడుతున్నవి. త్వరగా రైతులకు మంచి అవకాశాలు కల్గుతాయని నేను ఆశిస్తున్నాను. వెంకటసుబ్బయ్యగారు ఈ Rural Credit Survey Report అంతాకూడా బాగా అవగాహనచేసుకున్నట్లు అర్థమవుతోంది. వారు ఒక్కొక్క Rural Bank లోనూ ఒక statistics branch, stores branch, Kcredit branch మూడు branch లు పెట్టాలని తరువాత ఆ Bank కు సంబంధించినటువంటి గ్రామాలలో ఉండేటటువంటి families history అంటే వాళ్ళ ఆర్థిక పరిస్థితి, వారికి సంవత్సరానికి ఎంత ఆదాయం వస్తుందో, ఖర్చు ఎంతో, వారికి ఎంతపొలం ఉందో, ఎంత ఆస్తి ఉందో ఇవన్నీకూడా detailedగా పరిశీలించేందుకు ఏర్పాటుచెయ్యాలి అని చెప్పారు. కాని ఒక చిన్న Rural Bankలో ఇవన్నీకూడా నిర్వహించడానికి అవకాశం ఉంటుందా? నిర్వహించగల ఆర్థికపరిస్థితి వాళ్ళకు ఉంటుందా అనేటటువంటిది నాకు సందేహంగాఉన్నది. ఐనా జిల్లాస్థాయిలో Central Bankలో ఇటువంటి branch లు ఏమైనా ఏర్పాటుచేస్తే బాగుంటుందేమో మనమంతా ఆలోచించాలి. ప్రభుత్వం ఈ విషయమై ఆలోచించి ఆ విధంగా చేస్తుందని వారికి నేను మనవిచేస్తున్నాను. తరువాత separation of audit ని గురించికూడా వారు చెప్పారు "Audit ఒక్కటేకాకుండా Co-operative Department Registrar, ఆయనక్రింద ఉండే Deputy Registrar లకు ఈ సహకార ఉద్యమంలో ఎన్నో అధికారాలున్నాయి. సహకారసంఘాలను ఏర్పాటుచేయడం, అంటే సృష్టిచేయడం, వాటిని పోషించడం, వాటిని liquidate చేయడం, అంటే సృష్టిస్థితిలయాలు మూడు అధికారాలూకూడా వాళ్ల చేతులలో ఉన్నాయి, ఇది మంచిదికాదు, ఏదో ఒక అధికారమైనా తీసివేస్తే బాగుంటుందనే" సలహా ఇంతకుపూర్వంకూడా వెంకటసుబ్బయ్యగారు ఇచ్చినారు. అది ఆలోచిస్తున్నాం. త్వరగా దాని విషయంలో ఒకనిర్ణయం చేస్తామని మనవి చేస్తున్నాను. నీరా సొసైటీలనుగూర్చి నరసింహమూర్తి గారు చెప్పారు. ఈ మధ్యనే ప్రభుత్వంవారు 50 నీరా సొసైటీలు ప్రారంభించారు. అందులో దుర్వినియోగం జరుగుతోంది. తీపికల్లు పుల్లకల్లుగా మారుతోంది. దాన్ని కనిపెట్టాలి. నీరాను బెల్లంగా మార్చవచ్చు లేక కల్లుగా మార్చవచ్చు. బెల్లంగా మారిస్తే అది సద్వినియోగంచేసినట్లవుతుంది. బెల్లంగా మార్చకుండా, దానిని గంటపేళ్ల అట్టేపెట్టి పుల్లబడినతరువాత త్రాగినట్లయితే అది దుర్వినియోగం చేసినట్లవుతుంది. అందువల్ల వినియోగంకావడం మాట నిజమే ఐనప్పటికీ అది సద్వినియోగమా లేక దుర్వినియోగమా అని మనం ఆలోచించాలి. ఈవిషయమై చాలా సలహాలు ఇచ్చారు. బొజ్జా అప్పలస్వామిగారు లంకభూముల విషయంచెప్పారు. అందులో మేము దాదాపు 15 వేల ఎకరాల లంకభూములు ఇస్తున్నాం. పదివేల ఎకరాలుమాత్రం పశుగ్రాసం

కోసం రైతులకు ఉంచామని నేను చెప్పాను. కాని అప్పలస్వామిగారు ఏమీ చేయలేదు, ఈ ప్రభుత్వానికి దయలేదు, దాక్షిణ్యంలేదు, మేము ఎన్ని చెప్పినాకూడా వారుబీదలను పోషించే ప్రభుత్వం కాదనే విధంగా, చెప్పారు. దేవాలయాల పొలాలు గాని, లంకభూములు ఇవ్వడంలో గాని, ప్రభుత్వస్వాధీనంలోయుంటే బంజర్లివ్వడంలో గాని ఈ Field Labour Co-operative Societies కూ, Tenants Co-operative Societies కూ ఇవ్వడంగాని, forest coupes ఇవ్వడం ఇవన్నీ ఒకసారి చూచుకున్నట్లయితే ఎంత మహత్తరమైన కార్యక్రమం జరుగుతోందో బీదలకందఱకు ఎంత లాభదాయకంగా జరుగుతోందో గుర్తించాలి. జరిగిందేదో జరిగింది, ఇంకా జరగవలసినది ఉన్నదనే విషయం ఆలోచించాలి గాని, ఏమీ జరగలేదని చెప్పడం న్యాయంకాదు. ధర్మంకాదు

Mr. SPEAKER :—Sri Vavilala Gopalakrishnayya has given cut motion. He did not get an opportunity to speak. Has the Hon. Minister anything to say about that matter.

THE HON. SRI D. SANJIVAYYA :—అది Co-operative సంస్థలే చేసుకోవాలండి ; మాకేమీ సంబంధంలేదు.

SRI PRAGADA KOTAIAH :—ఇప్పుడు తక్కావిలోన్సు 70 లక్షల రూపాయిలు ఈ revenue సిబ్బందిద్వారా పంపకంచేయడంవల్ల అనేక దురలవాట్లు అంటే లంచగొండితనం ఎక్కువవుతోంది, వాటిని Co-operative Credit Societies ద్వారా, లేక Central Banks ద్వారా ఎందుకు distribute చేయకూడదనే విషయాన్నిగురించి ఆలోచిస్తారా ? Co-operative advisory Committee ని expand చేసే విషయాన్నిగురించి ఏదైనా చెబుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది ఆలోచించడానికి ఏమీ అభ్యంతరంలేదు. Co-operative సంస్థలద్వారానే తక్కావి ఋణాలు పంచే విషయం ఆలోచిస్తాం. Co-operative Advisory Committee ఎప్పుడు form చేసిరి, శాసనసభనుంచి ఎవ్వరూ అందులో మెంబర్లుగాలేరనే విషయం చెప్పారు. ఆ విషయం ఆలోచించి దాన్ని expand చేయడానికి అవకాశం ఉంటే expand చేస్తాం.

Mr. SPEAKER :—Who will recover it ?

SRI PRAGADA KOTAIAH :—The Co-operative Societies will themselves recover and repay to the Government.

THE HON. SRI D. SANJIVAYYA :—సభ్యుల విమర్శలూ, సలహాలూ, సూచనలు ఇచ్చినందులకు వారికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను. Cut motions అన్నీ withdraw చేసి ఈ పద్దును ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

SRI G. NAGESWARA RAO :—Mr. Speaker! on a point of information ఇప్పుడు లంకభూములు ఈ Society లకు ఇచ్చే విషయంలో, బంజరుభూములు ధరకట్టి ఎట్లా ఇస్తున్నారో, అల్లాగే లంకభూములు కూడా ప్రక్కనుంచే రైతువారీ రేటుప్రకారం ఎకరానికి ఇంతని చెప్పి, దానికి 20 రెట్లో, 30 రెట్లో, ఖరీదుకట్టి అది ఏ 30 సంవత్సరాలలోనో తీర్చుకునేలాగ ఈ Field Labour Co-operative Society లకు ఇచ్చుటకు ప్రభుత్వంవారు ఏమైనా ఆలోచిస్తున్నారా? అలాగైతే ఈ సొసైటీల సమస్య చాలావరకూ తేలుతుంది. ఇంకొక ప్రధానమైన సమస్య Central Bank లు వీటిని affiliate చేసుకుని ఆ Society లకు అప్పులు ఇవ్వాలి. లేకపోతే ఒక ప్రత్యేక Co-operative Bank ఐనా ఈ F. L. C. Society లకు స్థాపించాలి. ఈ రెండింటిలో ఏదో ఒకటి చేయకపోతే అసలు ఈ Society లు పనిచేయలేవు. ఇక ముందు పోటీ Society లు పెట్టవచ్చునంటున్నారు. అది కలహాలకూ అనైక్యతకూ దారితీస్తుంది. ఈ విషయమై మంత్రిగారు ఏమిచెబుతారో వినగోరుతున్నాం.

THE HON. SRI D. SANJIVAYYA :—20 సంవత్సరాలో, 30 సంవత్సరాలో లంకభూములు ఇవ్వడానికి అవకాశంలేదండి. అప్పుడప్పుడు వరదలు వచ్చి లంకలు disappear అవుతూ ఉంటాయి. 5 సంవత్సరాలవరకూ ఇవ్వాలని ఉత్తరువులు ఉన్నాయి. మిగతా విషయాలన్నీ ఆలోచిస్తాం.

**MR. SPEAKER :—I will now put the cut motion (No. 492) of Sri Vavilala Gopalakrishnayya to the vote of the House.**

**The question is :**

> **"To reduce the allotment of Rs. 77,25,200 for Co-operation by Rs. 100."**

[28th March 1956

(కో ఆపరేటివ్ సిబ్బందికి ఎన్. జీ. ఓ. లకిచ్చే వైద్య, విద్యాసౌకర్యాలు యివ్వవలెనని.)

The motion was lost.

MR. SPEAKER :—I will now put the cut motion (No. 503) of Sri P. Satyanarayana to the vote of the House.

The question is :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

(చేనేత ప్రాథమిక సొసయిటీలకు వినియోగపడని సెంట్రల్ కో ఆపరేటివ్ బ్యాంకులమీద సొసయిటీలను ఆధారపెట్టే విధానం మాని చేనేత సొసయిటీలకు ప్రత్యేక ఎపెక్సు బ్యాంకు నెలకొల్పవలసిన అవసరాన్ని ప్రభుత్వదృష్టికి తెచ్చుటకు.)

The motion was lost.

MR. SPEAKER:—I will now put the cut motion (No. 509) of Sri P. Satyanarayana to the vote of the House.

The question is :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

(చేనేత సొసయిటీలలో లడ్డి 1 కి రూ 0-8-0 కనీసం వేతనంగా నిర్ణయించవలసిన అవసరాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చుటకు.)

The motion was lost.

MR. SPEAKER :—The Hon. Member Sri B. Rama Reddi is not in the House and his cut motion (No. 514) will be deemed to have been withdrawn.

SRI PILLALAMARRI VENKATESWARLU :—No, Sir.

MR. SPEAKER :—Then, I will put it to the vote of the House.

The question is :

"To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs. 100.

28th March 1956]

(To criticise the Government for not changing the procedure to expedite payment of loans to the applicants in land Mortgage Banks )

The motion was lost

MR. SPEAKER.—I will now put the cut motion (No. 516) of Sri G. Nageswara Rao to the vote of the House.

The question is :

To reduce the allotment of Rs. 77,25,300 for Co-operation by Rs 100.

(యస్. ఎల్. సి. సొసైటీలకు ఏవిధంగాను క్రెడిట్ సౌకర్యాలు లేకపోవడము వల్ల సొసైటీలు అనేక యిబ్బందులు పడుతున్నాయి. యీ విషయములలో ప్రభుత్వము ఒక ప్రత్యేక కో-ఆపరేటివ్ బ్యాంకును స్థాపించే అవసరాన్ని గుర్తించక పోవడము గురించి చర్చించేందుకు.)

The motion was lost

MR. SPEAKER :—Now, I will put the main Demand to the vote of the House.

The question is :

"That the Government be granted a sum not exceeding Rs. 77,25,300 under Demand XX—Co-operation."

The motion was carried and the Grant was made

Demand XVIII—AGRICULTURE & FISHERIES

Demand XIX—VETERINARY

Demand IV—FORESTS

THE HON. SRI K. OBULA REDDI :—Mr. Speaker, Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a sum not exceeding Rs. 97,13,900 under Demand XVIII—Agriculture and Fisheries."

"That the Government be granted a sum not exceeding Rs. 31,23,100 under Demand XIX—Veterinary."

"That the Government be granted a sum not exceeding Rs. 35,78,600 under Demand IV—Forests."

Sri K. Obula Reddi] [28th March 1956

1956-57 సంవత్సరమునకుగాను 18 వ పద్దు Agriculture and Fisheries క్రింద రు 97,13,900 లు, 19 వ పద్దు Veterinary క్రింద రు 31,23,100 లు 4 వ పద్దు Forests క్రింద రు 35,78,600 లు శాసనసభ ఆమోదానికిగాను ప్రతిపాదిస్తున్నాను. దీనికి సంబంధించిన వివరాలు శాసనసభ ముందు ఉన్నవి. రెండు గంటలు కాలముమాత్రమే ఈ పద్దులకు కేటాయించబడినది. ఇందులో నేను తిరిగి చెప్పడంఅంటే అరగంటఅయినా పడుతుంది చర్చలో raise చేసిన points కు సమాధానాలు తరువాత చెబుతాను. అమూల్యమైన సలహాలను ప్రభుత్వశక్తికి లోబడి నిర్వర్తించడానికి ప్రయత్నంచేస్తాము.

MR. SPEAKER :—Motions moved :

"That the Government be granted a sum not exceeding Rs. 97,13,900 under Demand XVIII—Agriculture and Fisheries."

"That the Government be granted a sum not exceeding Rs. 31,23,100 under Demand XIX—Veterinary."

"That the Government be granted a sum not exceeding Rs. 35,78,600 under Demand IV—Forests."

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I move the cut motion (No. 711) standing in my name .

To reduce the allotment of Rs. 97,13,900 for Agriculture and Fisheries by Rs. 100.

(పత్తికొండ తాలూకాలో ఎరువుల ఋణాలు ఈ సంవత్సరం 50,000 లకు తగ్గకుండాయిచ్చే ఏర్పాటు చేయవలసిందిగా.)

Sm VAVILALA GOPALAKRISHNAYYA :—Sir, I move the cut montion (No. 73;) standing in my name :

"To reduce the allotment of Rs. 31,23,100 for Veterinary by Rs. 100."

(పత్తికొండ తాలూకా పశు వైద్యశాలకు శాశ్వత భవనం ఏర్పాటు చేయించవలెనని )

SRI VAVILALA GOPALAKRISHNAYYA.—Sir, I move the cut motion (No 661) standing in my name.

To reduce the allotment of Rs 35,78,600 for Forests by Rs. 100.

(సత్తెనపల్లి తాలూకా బోదనం, పెదనెమలిపురం, లింగపల్లిపాడు ఫారెస్టులలో సాగుకు యివ్వవలెనని)

SRI PILLALAMARRI VENKATESWARLU:—Sir, I move the cut motion (No. 662) standing in my name.

To reduce the allotment of Rs. 35,78,600 for Forests by Rs. 100.

(To discuss the failure of the Government to make available for cultivation portions of forest areas that could be made available for cultivation to the poor)

SRI S. VEMAYYA :—Sir, I move the cut motion (No. 678) standing in my name.

"To reduce the allotment of Rs. 35,78,600 for Forests by Rs. 100."

(For the failure of the Government to issue green manure leaves to the Agriculturist in the State liberally.)

SRI G. NAGESWARA RAO :—Sir, I move the cut motion (No. 681) standing in my name.

"To reduce the allotment of Rs. 35,78,600 for Forests by Rs. 100."

(తూర్పు గోదావరిజిల్లాలో ఎస్టేటు అడవులనుండి పేద ప్రజలు ఎండుకట్టెలు, తెచ్చుకొని జీవించే అలవాటు జమీందార్ల కాలమునుండి వుండగా ఎస్టేటులను ప్రభుత్వము తీసుకున్న తరువాత పేదప్రజలకు అటువంటి అవకాశము లేకుండా వారిపై అధిక పెనాల్టీలువేసి కేసులు అనలు జరుపుతూన్న విషయమును గురించి చర్చించేందుకు.)

MR. SPEAKER :—Now, the cut motions as also the Demand are before the House for discussion. There are 20 Members who wish to participate in the debate and so I fix five minutes for each Member. Mr. Tahseel will commence the debate.

SRI MOHAMMAD TAHSEEL:—అధ్యక్షా, గతసంవత్సరం Forest Demand పై supplementary పద్దు చర్చకు వచ్చినప్పుడు Upper Godavari Division లో ఉన్న forest కూపులు గవర్నమెంటు తీసుకుని పనులు చేయిస్తుందని చెప్పినప్పుడు వారికి జీపులు సప్లయిచేస్తే పనులు supervise చేయడానికి బాగా ఉంటుంది అన్నప్పుడు నేను ఆ పద్దుపై హర్షాన్ని ప్రకటించాను. తరతరాలుగా కంట్రాక్టర్లు గిరిజనులను అన్యాయంగా దోచుకొని చాలా లాభాలు గడిస్తున్నారు. ఆవిధంగా కాకుండా ప్రభుత్వమే దీనిని తీసుకుని పనిచేయిస్తే కొంతవరకైనా rate ప్రజలకు గిట్టుబాటు అవుతుందని చాలారోజులనుంచి అనుకున్న అభిప్రాయం. దీనిమూలంగా కొన్ని కూపులు తీసుకుని గవర్నమెంటు పనిచేయిస్తున్నది. దీనిలో ఒక range విషయంలోమాత్రం కొన్ని లెక్కలు సేకరించాను. ఆ లెక్కలు గురించి వివరంగా మీముందు పెట్టదలచాను. కూనవరం range లో ఒక కూపు ఉన్నది. అందులో నరికిన శాలితీలు 555. రెండవ కూపు గవర్నమెంటు unreserved కూపు. అందులో 5902 శాలితీలు నరికారు. మూడవది C. W. C. మదిగూడెం block. అందులో 406 శాలితీలు నరికారు. గవర్నమెంటు రేటు ప్రకారం నరకడానికి ప్రజలకు ఇవ్వవలసినరేటు ఘనపుటడుగుకు 0—2—0. ఆప్రకారం అయితే 25 × 40 C F. గల పలకకు రు. 2—8—0, 10 × 15 C. F. గల పలకకు రు. 1—8—0 6 × 12 C. F. గల దూలానికి రు. 1—0—0, 4 C. F. గల బాజుకు రు. 0—8—0 అడుగుల వాసానికి రు. 0—4—0. కాని అక్కడ Forest Officer, ఇచ్చేది హైరకాలకు పలక ఒకటింటికి రు. 1—8—0, రు, 1-0-0, రు 0-8-0, రు. 0—4—0, రు. 0—2—0 చొప్పునమాత్రమే ఇస్తున్నారు. ఈవిధంగా ఇవ్వడంమూలంగా అక్కడ గవర్నమెంటు ప్రకటించినరేటులో సగానికిసగం మాత్రమే ఇవ్వడం జరుగుతోంది. ఈ విషయమై ఎన్ని విజ్ఞప్తులుచేసినా, అధికారులుమాత్రం ఇక్కడ కూలీలు లేకపోతే మరొకచోటనుంచి తీసుకువచ్చి పనులు చేయించుకుంటామని చెబుతున్నారు. ఆవిధంగాచూస్తే మూడుకూపుల నుంచి నరకడానికి గవర్నమెంటు C. F. ఒకటింటికి 0—2—0 ఇస్తుంటే 0—1—0 చొప్పున మాత్రమే వారికి ఇస్తున్నారు. బండి బాడుగలవిషయంలో

కూడా ఇదేవిధంగా జరుగుతోంది. Selection felling కూపులలో బండి బాడుగ C. F. ఒకటింటికి రు. 0—9—0 లు కూపునుంచి పొలిపాకరేవుకు తీసుకు రావడానికి, అందులో సరిగానే ఇచ్చారు. బాగానే ఉంది. Unreserved కూపులో గవర్నమెంటు రేటు రు. 0—7—11 లు అయితే రు. 0—7—0 చొప్పునమాత్రమే ఇస్తున్నారు. ఈవిధంగా చేయడంమూలంగా 32 వేలు C. F. కలిగినదానిలోనుంచి రు. 5831—5—4 officers కాజేయడం జరిగింది. మూడుకూపులనుంచి నేను సేకరించిన లెక్కలప్రకారం Range Officer సంపాదించినది రు. 7689—13—8 లు. పొలిపాకనుంచి రాజమండ్రి ఎగుమతిచేయడానికి గవర్నమెంటు C. F. 0—8—0 లు చొప్పున rate ఇస్తుంటే అందులో ఎంత కాజేస్తున్నారో తెలియదు. ఆ వివరాలు నాదగ్గరలేవు అందులోకూడా కొంత ఉంటుందనే నా అభిప్రాయం. రోడ్లుకూడా Forest Department వారే వేస్తున్నారు. Bhimavaram to Buruguvada 5 మైళ్లు, Polipaka to Tatipaka 5 మైళ్లు, Yetapaka to Tumikicheruvu 5 మైళ్లు. గవర్నమెంటు రేటు ప్రకారం unit రు. 21—12—0 ఉంటే unit కు రు. 15 లు మాత్రమే ఇస్తున్నారు. ఫర్లాంగుకు సుమారు రు. 8 లు చొప్పున 15 మైళ్లకు 12 వేల రూపాయిలవరకు ఆఫీసర్లు కాజేస్తున్నారు. Forest Department లో మితిమీరిన లంచగొండితనం ఉన్నదనే సంగతి బట్టబయలు చేయడానికే మాట్లాడుతున్నాను.

వర్జీనియావేసి రైతాంగము 14000 ఎకరాలు సాగుచేస్తూన్నారు, పెండ్యాల సత్యం, కొండలరావుగారు పర్యటన చేసి 10,000 మాత్రం అంటున్నారు. పది ఎకరాలు ఒక barrel కు సరిపోతుంది. 10,000 ఎకరాలకు 1000 బారెల్సు ఉండవలెను. వాటికి ఫారెస్టు అధికారులు రు 40/- లంచం తీసుకొంటున్నారు. కొన్ని కూపులలో వంట చెరుకు ఇవ్వవలసి ఉన్నది. సకాలంలో పెర్మిట్లు ఇవ్వరు. జూలైలో పెడితే Confirm చేసి ఇవ్వడము December లో. అవసరం నవంబరులో ఉంటుంది. లంచాలు ఇచ్చి కలప తీసుకోనకపోతే నాశనం అగుతుంది. ఈ సంవత్సరం రైతులకు నష్టం వచ్చింది అంటే బారెలుకు రు. 40/- తీసుకొంటున్నారు. అంటే రు. 40,000 లంచాలుతీసుకుంటున్నారన్న మాట ఇది బహిరంగ రహస్యము. 5 గురు రేంజర్లు తీసుకుంటున్నారు. గత సంవత్సరం బారెలుకు 50/- తీసుకున్నారు. అయితే ఇది పై అధికారులకు తెలియదా అంటే నమ్మడానికి వీలు లేదు. అక్కడ ఫారెస్టరు, రేంజర్సు, గార్డు ఉంటారు. D.F.O. నెలకు 20 రోజులు ఆ ప్రాంతములోనే ఉంటున్నాడు. అయనకు ఏ విధముగా తెలియకుండా ఉంటుంది? పై ఆఫీసర్లకు తెలిస్తే చర్య ఎందుకు తీసుకోరు? రిజర్వు ఫారెస్టు రైతాంగము

Sri Mahammad Tahseel] [28th March 1956

తీసుకోనకపోతే Forest నాశనము అవుతుంది. 40/- రూపాయిలు ఇచ్చినపుడు నీవాటూకు ఒక కేసు మాకు ఇవ్వవలెను అని అంటారు. రు. 40/- ఇచ్చి కొందరు మోళ్లను చూపిస్తారు. ఈ విధముగా లంచ గొండితనము సాగితే మన పంచవర్ష ప్రణాళిక తీసుకొని గిరిజనులను అభివృద్ధి చెయ్యవలెను అనే రోజులలో ఈ విధముగా జరిగితే ఏ మాత్రము క్షమించడానికి వీలులేదు. ప్రభుత్వంవారు కఠినమైన చర్యలు తీసుకోనకపోతే ఫారెస్టు నాశనం అవుతుంది. రైతులు మీరు ఇచ్చే rate చాలదని నిస్పృహ చెందుచున్నారు.

ఇక ఫిషరీసు గురించి. శబరి నది ఉన్నది. గవర్నమెంటువారు దానికి పాట పెట్టారు. దానిమీద ఆదాయము సంవత్సరానికి 50/- వస్తుంది. దీనికి ఇరు ప్రక్కలా 150 గ్రామాలలో ఉంటే కోయలు చేపలు పట్టుకొని జీవిస్తూ ఉంటారు. ఈ పాట తీసుకునని ఒక సాహుకారు, చేపలు పడుతూ ఉన్నవి కాబట్టి గాలం ఉన్న వారివద్ద 10/- తీసుకొంటాడు. వారా పాటపాడే స్థితిలో లేరు. ఈ 50/-లలో ప్రభుత్వానికి నష్టము ఏమీ లేదు. కాబట్టి నేను పాటను తగ్గించవలెనని కోరుచున్నాను.

SRI K. KOTI REDDI :—అధ్యక్షా, ఈ డిమాండును నేను బలపరుస్తున్నాను. నా స్వంత అనుభవాలనుబట్టి వ్యవసాయ మంత్రిగారికి కొన్ని సూచనలు చేసేదానికి నేను మాట్లాడ దలచుకొన్నాను. వ్యవసాయ మంత్రి మనకు కొత్తవారైనాకూడా అతనికి వ్యవసాయములో చాలా అనుభవము ఉంది. అందువల్ల నేను ఎక్కువగా చెప్పబోయేదికూడా వారికి తెలియని విషయము ఏమీ ఉండదనే నా నమ్మకము. కాని నేను ఒకటి రెండు సూచనలు చెయ్యదలచుకొన్నాను.

ముఖ్యముగా రైతులు పండించే పంటలను ఏవిధముగా హెచ్చుచేసినప్పటికికూడా రైతులకు తమ పంటలకు వచ్చే వెలలు సరైనవి లేకపోతే హెచ్చు పండించినాకూడా వారికి ప్రయోజనము ఉండదు అని మన అందరికి తెలిసిన విషయమే. రైతుకు పండినపంటలు అమ్మినపుడు వెలలు ఎక్కువగా ఉండవు. పిమ్మట రానురాను పెరుగుతవి. ఉదాహరణకు ముఖ్యముగా ఈ రాయలసీమ, గుంటూరు, విశాఖపట్నం జిల్లాలో హెచ్చుగా పండేది వేరుశనగ, ప్రారంభములో రు. 3 మణుగు ఉండి, 3-8-0, 5, 6 కూడా పోతుంది. 50 మణుగులు పండించే రైతు ప్రారంభంలో అమ్ముకుంటా వెల పెరిగినప్పుడు అమ్మితే ఒకటికి రెండింతలు వచ్చేది. ఇది ప్రతి సంవత్సరము జరుగుతున్నది. Commercial crops కాకుండా తిండి గ్రాసాలకు కూడా ఇదేవిధముగా ఉంది. చాలా సంవత్సరాలుగా రైతు పంటలకు సరైన ధరలు ఇవ్వడానికి ప్రయత్నములు జరుగుచున్నవి. Central Government

ఆలోచిస్తున్నది. State గవర్నమెంటువారుకూడా ఆలోచిస్తున్నారు. ఫలితం ఇంతవరకు రైతులు ఎక్కువగా అనుభవించలేదు కొబట్టి వ్యవసాయ మంత్రిగారు తగిన కృషి చేయవలెనని నేను కోరుచున్నాను ఇందులో మరియొక విషయం ఉన్నది. సాధారణముగా పంటలు వచ్చే సమయములోనే ల్యాండు రివెన్యూ వసూలు చేస్తారు. కిస్తీలు ఎప్పుడూ రైతులవద్ద పంటలు వచ్చినప్పుడు immediate గా వసూలు చేస్తారు. కాని మొదటలో పూర్తి మొత్తము రాదు. పంట అమ్ముకొన్న తరువాత రాబట్టడము కష్టమని కిస్తీలను ఏర్పాటు చేసినారు. ఇప్పుడుకూడా అదే ఉన్నది. ముఖ్యముగా Land Revenue నిబంధనల ప్రకారము ప్రజలపై కేసులు పెట్టినప్పుడు వారి పంటలు అమ్ముకోవలసి వస్తుంది. కొనేవారు ఈ సందర్భం పురస్కరించుకొని చాలా తక్కువ వెల ఇస్తారు. కొబట్టి మహమ్మదీయుల కాలములో వలె ఫసలీ July నుండి June కు ఉంటే చాలా బాగుండునని అనుకుంటున్నాను. దీనివలన గవర్నమెంటుకుకూడా కొంత మేలు. బడ్జటుకుకూడా ఉపయోగపడవచ్చును. అట్లాలేక పోతే ఈ కిస్తీలు లేటుగా March, April, May, నెలలకు మార్చుకుంటే బాగా ఉంటుంది. పండనపుడు కిస్తీలు కట్టాలి అంటే రైతులు చాలా అవస్థలు పడుతున్నారు. రివెన్యూ మంత్రిగారు దీనికై తగు ఏర్పాటుచేస్తే బాగుంటుందేమో. నేను ఉన్నప్పుడుకూడా ఇది ఆలోచనలో ఉండేది కాని నేను చెయ్యలేక పోయినాను.

Pests గురించి చాలా శ్రద్ధ అవసరం. ఎంత మొత్తం ఖర్చుపెట్టినప్పటికీ కూడా దాని ఫలితం ఉన్నదని నమ్మకంలేదు. ఉదాహరణకు పోయిన సంవత్సరం పసుపు పంటకు రోగంవచ్చింది. రోగం వదలి వెళ్ళిన తరువాత Agriculture Officer లు కొంతమంది వచ్చి మందుచల్లితే బాగుంటుందని కొన్నిచోట్ల సూచన చేశారు. ఈ సంవత్సరంకూడా కొంత ప్రయత్నం చేసినారు, గాని వారు చేసినటువంటి ప్రయత్నం జాస్తిగా ఫలించలేదు. పంటకుసరైన ధరలు ఏర్పాటు చేయడం ముఖ్యమైన విషయం. Marketing societies ఏవో ఏర్పాటు చేస్తాం అని కడప, కర్నూలు అనంతపురం జిల్లాలలో ప్రయత్నంచేశారు. ప్రయత్నం యింకా చేస్తున్నారు. దీనియొక్క ముఖ్యోద్దేశంమాత్రే యితర దేశములనుంచి ఏ దేశములలోనైతే యీ రైతులకు వెల హెచ్చుగా వస్తుందో ఆ సమాచారం తెలపడమే దీని ముఖ్య ఉద్దేశ్యం అని నాకు తోస్తుంది. అంత చాలదు, నిజంగాకూడా ఏవిధంచేతనైనా సరైన వెలలు వచ్చేంతవరకూ తమ అవసరాలు తీర్చడానికి ఫండొకటియున్ని అమ్మకుండా ఏదయినా ఒక విధంగా ఏర్పాటు చేస్తేనే ఉపయోగం ఉంటుంది, గాని కేవలం

దేశంలో వెలలున్నాయి అంటే బీదలుగా వున్నటువంటి రైతులు ఆవిధంగా చేయజాలరు. అందువల్ల యీ marketing societies ప్రతి జిల్లాలో హెచ్చుచేసి godowns పెట్టవచ్చిన ఫలసాయాన్ని తీసుకువస్తే తాత్కాలికంగా కొంత మొత్తమైనా యిచ్చేఏర్పాటు చాలా విపులంగా చేస్తేనేగాని రైతులకు హెచ్చు ఉపయోగం ఉండదు. ఆ విధంగా Government ప్రయత్నం చేస్తున్నారు. ఈ విషయంలో చాలా శ్రద్ధ తీసుకోవాలని నాయొక్క మనవి. ఇక agriculture లో research ఎంతో చేస్తున్నారు కాని దాని ఫలితాలు రైతులు యిప్పుడు హెచ్చుగా అనుభవించడంలేదు. కారణం బహుశా చాలినంత మంది Agriculture Demonstrators లేకపోవడమే అని నా అభిప్రాయం. Firka కు ఒక demonstrator ఉంటేనేకాని పని చక్కగా జరుగదు. ఇప్పుడు ఏదో తాలూకాకు ఒకరు లేక కొన్ని తాలూకాలకు ఒకరు చొప్పున ఉన్నారు. తాలూకాకు యిద్దరుండినాకూడా చాలదని నా అభిప్రాయం. Statistical work తోనే ఒకరికి పూర్తిగా కాలం సరిపోతుంది. అందుచేత అనేక గ్రామాలు పోయి రైతులకు ఆధునాతనపద్ధతులగురించి చెప్పజాలరు. అంతేకాకుండా సామాన్యంగా మనదేశంలోని రైతులకు ఒకసారి చెబితే ప్రయోజనంఉండదు. ఒకసారి కాదు 4 సార్లు చెప్పాల్సివస్తుంది. బుజ్జగించి చెప్పాలి. ఇంత చేస్తేనేకాని రైతులు కొత్తపద్ధతిని అవలంబించరు. రైతుల తప్పేమీలేదు ; వాస్తవంగాకూడా కొంతవరకు విషయాలు గమనించి చేయాలి. Government తీసుకున్నంత risk వాళ్లు తీసుకోజాలరు. అందువల్ల demonstration విషయంలో staff అభివృద్ధి చేయాలని నా అభిప్రాయం. Firka వారిగా అయినప్పటికీకూడా ఏదో maistry, field worker వీరివల్ల హెచ్చుగా పనిజరుగదు. Training అయినవాళ్లు కావాలి. తరువాత బాపట్లలో College ఉండడానికి అది suitable place కాదని నా నమ్మకం. అయినా ఆనాడు Adviser కాలంలో Agriculture College గురించి విచారించి బాపట్లలో కొన్ని District Board buildings offer చేసినారు. ఏదో అక్కడ ఉండింది ఉండనివ్వండి మంచిదే. కాని యింకో Agriculture College ఈ ప్రాంతంలో ఉండాలి. అనేకవిధములైన సౌకర్యాలు కలిగి అన్నిరకాల soils కలిగిన కర్నూలుజిల్లా నంద్యాలలో ఒక ప్రక్కన ఎర్రభూమి ఒకప్రక్కన రేగడిభూమివున్నది. Dry cultivation, wet cultivation ఉంటుంది. ఇప్పుడు K. C. Canal improvement వల్ల హెచ్చుగా నీరు [illegible] అవుతుంది. కావలసిన extents of land ఉన్నది. [illegible] Government ఖర్చుపెట్టవలసిన అవసరంలేదు. Agri-

28th March 1956] [Sri K. Koti Reddi

culture College కి ఒక farm పెట్టడానికి ఆలోచనలో ఉన్నదని మంత్రిగారు చెప్పినారు. ఒకప్పుడు Central Government Bangalore లో ఉంచేటటువంటి land కావాలంటే నంద్యాల అయితే బాగుంటుందని నేను suggest చేస్తిని. అది ఏమయినదో తెలియదు కాని ఏమయినప్పటికీ ముందుగా అక్కడ Agriculture College పెడితే అనుకూలంగా ఉంటుంది. Agriculture Graduates హెచ్చుచేయడం అవుతుంది. అందుచేత అక్కడ Agriculture College ఏర్పాటు చేస్తే చాలా బాగా ఉంటుందనిచెప్పి నానమ్మకం. మనదేశంలో తిండి పదార్థాలు కాకుండా పంటలు అభివృద్ధిచేసేదానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. అందులో రెండో పంచవర్ష ప్రణాళికలోకూడా దీనికి చాలా ముఖ్యమైనటువంటి place ఉంటుందన్నారు. సంతోషమే. కొన్నిపంటలు ఏ ప్రదేశాలలోనైనా ఉత్పత్తిచేయవచ్చు. అయితే నల్లరేగడిప్రదేశాలు ఎర్రరేగడిప్రదేశాలు చాలా అనుకూలం. రెండోది నీటి ఆధారానికి, శీతోష్ణస్థితికి చాలా సంబంధం ఉన్నది. కొన్ని పంటలు ఎండకాలములోగాని కొన్ని ప్రదేశంలో పండవు. ఆంధ్రరాష్ట్రం విశాలాంధ్ర అయితే అనేకచోట్ల పెంగ వచ్చు Temperate climate చాలా హెచ్చు ప్రదేశాలలో ఉన్నది. కొన్ని కూరగాయలు అన్నిచోట్లా పండవు. ఒకసారి నేను Araku Valley పోయాను. మంత్రిగా వున్నప్పుడుకాదు. అక్కడ పరిపండిస్తూ ఉండినారు. మరి మిగతా స్థలాలలో కూడ పండుతుంది. అక్కడి శీతోష్ణస్థితికి అనుకూలంగావుంటే కూరగాయలు పండించాలని దానిమీదే concentrate చేయాలని అక్కడ straw beries పండిస్తే అనుకూలంగా వుంటుందని నేను ఒక suggestion చేస్తిని. Straw beries ఉడుకుప్రదేశాలలో పండవు. దీనిని try చేయవలసినదని ఒక suggestion చేస్తిని. Straw beries ఊటీనుంచి తెప్పించి యిస్తిని. వేస్తిరి. చాలా సంతోషం. వరి పెట్టకుండా యింకా యితరములైన vegetables ఆంధ్రదేశంలో పండించడానికి అవకాశంవున్నది. అందుచేత straw berries మీద concentrate చేస్తే ఎక్కడైనా పండుతుంది. దేశముడిప్పుక climate లో ఏ పంటలు బాగా పండుతాయో వాటిపైన concentrate చేయండి. ప్రతిగ్రామంలో అన్ని పండించాలనే తత్వంతో నాకు నమ్మకంలేదు. ఏ ఏ ప్రదేశాలలో ఏవి పండుతాయో ఆలోచించమని మంత్రిగారికి మనవిచేస్తూ ముగిస్తున్నాను.

**Sri N. P. CHENGALRAYA NAIDU** :—అధ్యక్షా, వ్యవసాయశాఖకు ప్రత్యేకమంత్రిగారిని నియమించినందుకు, మొట్టమొదట మన ముఖ్యమంత్రి

Sri N. P. Chengalraya Naidu] [28th March 1956

గారికి కృతజ్ఞత తెలుపవలసిఉన్నది. వ్యవసాయము గురించి మన వ్యవసాయమంత్రి గారికి చక్కగా తెలుసు. ఏ విషయంకూడా వారికి మనం చెప్పవలసినపనిలేదు. అయినా కొన్ని విషయములు వారి దృష్టికి తీసుకురావలసిన అవసరముయున్నది. వ్యవసాయదారుల కుమారులు చదువుకుంటున్నారు తరువాత వారికి ఏ ఉద్యోగము దొరకక, వ్యవసాయము చేసుకునేందుకు పనికిరాకుండాపోతున్నారు. అందువల్ల ప్రతిజిల్లాలోకూడా వ్యవసాయ పాఠశాలను ఏర్పాటుచేసి అక్కడవారికి వ్యవసాయములో బోధనజరపాలని మనవిచేస్తున్నాను. Agriculture College మనకు ఒకటి ఉన్నది. అందులో ఉత్తీర్ణులైనవారిని Demonstrators గా వేస్తున్నారు. అట్లాగే Field Maistriesకు కూడా ఒక కాలేజీనిపెడితే బాగుంటుంది. ప్రస్తుతం అటువంటివి ఎక్కడాలేవు. వ్యవసాయములో అనుభవము ఉన్నవారందరినీ Field Maistries గా వేస్తున్నారు.

వ్యవసాయదారులకు, Agriculture Department వారు ఆయిల్ ఇంజనలు, ఎలెక్ట్రిసిటీ మోటార్లు కొనుక్కొనుటకుగాను అప్పుఇస్తున్నారు. వారు సరియైన గడువులోపల వాటిని చెల్లించుకోలేకపోతే వాటిని పెరుక్కుపోతున్నారు. ఈ పద్ధతిమూలాన్నే వారికి వ్యవసాయపనులు జరుగకుండా పోతున్నాయి. మారువాడీ వారి దగ్గర అప్పులుతీసుకొనే దానికన్న ప్రభుత్వంవారిదగ్గర అప్పులు తీసుకోవడం ఇంకా చాలాకష్టం అయినదని నా అభిప్రాయము. వర్షాలు సరిగా కురవకుండా, పంటలు పండని ప్రాంతాలలో ఈ గడువును పెంచాలని కోరుతున్నాము. ప్రతిజిల్లాలోను Seed farm ఏర్పాటుచేయాలి. అప్పుడు మనకు కావలసిన విత్తనములు మనమే తయారు చేసుకోవచ్చును. రైతులకు సహాయముగా ఉంటుంది.

అడవుల విషయం ముఖ్యంగా మనవిచేయాలి. మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత మన ఉద్యోగస్థులందరూ వారి వారి బాధ్యతలను గుర్తెరిగి సక్రమంగా పని చేస్తున్నారు. ఇప్పుడు జమీందారీ ఏరియాలలోని అడవులన్నింటినీకూడా ప్రభుత్వమువారు స్వాధీనము చేసుకుంటున్నారు. District Forest Officers కు వాటి మీద అధికారము ఇస్తున్నారు. అది చూచుకునేందుకు వారికి కావలసినంత సిబ్బంది మాత్రము ఇవ్వలేదు. ఎవరైనా అడవులు కొట్టుకొని పోతూఉంటే వెంటనే ఆ ప్రదేశమునకువెళ్ళి ఆటకట్టుటకు చాలా కష్టంగాఉన్నది. తొందరగా పోవుటకు జీపులు అవసరం. అందువల్ల వారికి జీపులు ఇప్పించాలని కోరుతున్నాము. దానికి తోడు సరియైన సిబ్బందికూడా ఇవ్వాలని కోరుతున్నాను. కొత్త చెట్లను నాటిన వాటిని కాపాడేభారంకూడా వారికి ఇచ్చారు. వారు దానిని సక్రమంగా చూడలేదు. [illegible] సంవత్సరముల క్రితం ఈ అడవులను ఎంతో శ్రద్ధతీసుకొని పెంపొందించేవారు.

ఆ శ్రద్ధ ఇప్పుడులేదు. చెట్లునాటివామని చెబుతున్నారుగాని, వాటిని శ్రద్ధతో చూడటంలేదు. Forest Department వారు దానిని శ్రద్ధతో చూడవలయునని మనవి చేస్తున్నాను.

రాయలసీమకు Chief Conservator of Forests ఆఫీసు బళ్ళారిలో ఉన్నది. వారు రాయలసీమలో తిరుగవలయునంటే ఇంకొక రాష్ట్రమునుంచివచ్చి తిరుగవలసిన అవసరము ఉన్నది. అది చాలా కష్టంగాయున్నది. ఆ ఆఫీసును రాయలసీమలో అనువైనస్థలములో పెట్టించవలసినదిగా కోరుతున్నాను. మంత్రిగారు చెప్పినట్లు చిత్తూరులో పెట్టిస్తే మరీ బాగా ఉంటుంది.

SRI B. V. SIVAIAH :—అధ్యక్షా, Agricultural Demand ను నేను బలపరుస్తూ కొన్ని విషయములు మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. ప్రత్యేకంగా డిమాండుమీద నేను ఎక్కువసేపు మాట్లాడవలసి ఉన్నది. మంత్రిగారు వ్యవసాయములో అనుభవము ఉన్నవారుకాబట్టి, వారు ఈవిషయములందు తగుశ్రద్ధ తీసుకుంటారనే దృష్టితోనే వాటిని మనవిచేస్తున్నాను.

మన రైతులు పండించే పంటను అమ్ముకొనే సందర్భములో, వినియోగదారునకు, ఉత్పత్తిదారునకు మధ్యగా కొందరు మధ్యవర్తులు ఉంటున్నారు. ఈ మధ్యవర్తులను తగ్గించాలని చాలా కాలమునుంచీ ఆందోళన జరుగుతున్నది. అందులో బ్రోకర్సుగా ఉన్నవారిని తగ్గించినట్లయితే వినియోగదారులకు లాభములేకుండా చౌకగా దొరకడంవల్ల నాలుగుడబ్బులు సులువుగా వచ్చే అవకాశం ఉంటుందని చాలా కాలంనుంచి ఆందోళన జరుగుతున్నది. దీనిని సాధించడానికి ఉమ్మడి మద్రాసురాష్ట్రంలోనే Madras Commercial Crops Act ఒకదానిని pass చేశారు. ఆ Act ప్రకారం ప్రతిజిల్లాకు ఒక marketing committee ని స్థాపించాలని, దానిద్వారా సాధ్యమైనంత హెచ్చుకీలక ప్రదేశాలలో marketing yards స్థాపించి, వాటిద్వారా ఈ అమ్మకం అంతా జరిపించాలని, అవే ఏజన్సీలుగా పనిచేసి మధ్యనున్న బ్రోకర్సును, కమీషను ఏజెంట్లను తగ్గించాలని చాలా కాలంగా ప్రయత్నము జరుగుతున్నది. ఇది కేవలం చట్టంగా కాగితములోయున్నదేగాని, ఆచరణలో ఏమాత్రం పనిచేయడము లేదు. దాని విషయములో ద్వితీయపంచవర్ష ప్రణాళికలో, మొదటి పంచవర్ష ప్రణాళికలో కేంద్రప్రభుత్వమువారు, ప్లానింగ్ కమీషను వారు కూడా చాలా శ్రద్ధతీసుకున్నారు.

"The regulation of agricultural markets has to be undertaken so that the producer is assured of a fair

deal. This was recognised in the first plan which recommended the extension of the operation of the Agricultural Produce (Markets) Act to all important agricultural markets."

అని మనకు ఇచ్చినటువంటి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో యున్నప్పటికి, మన State తయారుచేసినటువంటి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఈ రెగ్యులేటర్ మార్కెట్టును ఏవిధంగా విస్తరణచేదాము అనే అంశాన్నిమాత్రము పొందుపరచలేదు. ఇప్పుడు అయినా దీనియందు తగినశ్రద్ధ తీసుకొని మనకు సరియైనమార్కెట్టును ఈప్లానులో పొందుపరుస్తారని ఆశిస్తున్నాము ఈ ప్లానులో కాకుండా ప్రత్యేకంగా ఒక కమిటీని వేశారు. వారుకూడా భారతదేశం అంతా ప్రచారము చేసి ఈవిషయమై హెచ్చుగా recommend చేశారు.

"We recommend that there should be regulated markets as many as possible and organised as quickly as possible".

1949 లో కమిటీ రిపోర్టువచ్చినప్పటినుంచి ఇప్పటివరకు అంటే 1957 సంవత్సరము వస్తున్నప్పటికి ఈ విషయములో హెచ్చుశ్రద్ధతీసుకొని, మార్కెట్టు మార్పులను విస్తరింపచేయకుండా ప్రయోగాత్మకంగా గుంటూరుజిల్లాలో ఈపొగాకు పంటకు సంబంధించి మార్కెట్టుయార్డును స్థాపించాలన్నారు. కాని గుత్తవ్యాపారస్తుల యొక్క వత్తిడివల్ల వారి ఆందోళనలకు తట్టుకోలేక, రైతులను పెడుతున్న హింసలను, తట్టుకోలేక యీప్రభుత్వ మార్కెట్టు కమిటీలకును ఇవ్వకపోయినందువల్ల, స్థిరమైన నిర్ణయము లేనందువల్ల, మరల మార్కెట్టు కమిటీల వ్యాపారాన్ని, అమ్మకములు ప్రస్తుతం నిలిపివేస్తాము అని చెప్పారు. కాని గుత్తవ్యాపారస్తులకుగాని, వ్యాపారస్తులకుగాని, ప్రభుత్వం లొంగిపోకుండా, యీ మార్కెట్టులు, స్టేటుఅంతా పెట్టి, ఒకసారి చూచినట్లయితే చాలా జయప్రదంగా పోతుంది. దీనివల్ల ప్రభుత్వానికి హెచ్చుఖర్చుకూడాలేదు. ఈ marketing Committee అన్నికూడా self-sufficient గా ఉన్నాయి. ప్రభుత్వంవల్ల ఏ విధంగాను ఇంతవరకు ఋణంపొందలేదు.

పొగాకువల్ల భారతదేశానికి 8 కోట్లరూపాయలు Excise duties వల్ల వస్తున్నది. హెచ్చుభాగము గుంటూరునుండియే పోతున్నది. అదికాకుండా మన [illegible] [illegible] దానిపై పన్ను విధించారు. ఈసందర్భములో గుంటూరు

Marketing Committee కి 2 లక్షలరూపాయలు ఇవ్వవలసిందని చాలామంది ప్రభుత్వంవద్దకు deputation వెళ్ళినప్పుడు ఇస్తాము అని చెప్పారు. కాని ఆ aid బడ్జెటులో ఎక్కడా కన్పించడము లేదు.

Central Tobacco Committee వారుమాత్రం 4 లక్షల రూపాయల విలువగల ఒక Factory 170 వేలకు concession rate కు ఇస్తామని చెప్పి tenders ను పిలిచి మళ్ళీ tenders ను కూడ కాదని వారికి ఇచ్చారు దీనివల్ల ప్రభుత్వమునకు చాలా ఆదాయం వస్తున్నప్పటికీ 2 లక్షలు రూపాయలు ఇచ్చుటకు కూడా ఇందులో provision చూపించలేదు. మంత్రిగారు రేపు గుంటూరు వెళ్ళబోతున్నారు. ఈ విషయమును పరిశీలించి ఆంధ్రకి తగువిధంగా సహాయపడతారని నేను ఆశిస్తున్నాను. వ్యవసాయమును గురించి Budget లో ఏదో కొంత provision చూపించినప్పటికీ వారికి వచ్చేటువంటి మెమోరాండములను సమగ్రంగా పరిశీలించి వ్యవసాయదారులకు సహాయపడదామనే వుద్దేశ్యంతో టి Agriculture Advisory Board ను స్థాపించినామని అన్నారు. State Agriculture Advisory Board ను స్థాపిస్తామని 1955 June లో ఒక G.O. pass చేశారు. వ్యవసాయదారులకు కావలసినటువంటి సౌకర్యములు, సదుపాయములు సంస్కరణాలు, Market విషయములలోను కలుగజేయుటకు ఆ Board యొక్క సంప్రదింపులు, సలహాలు తీసుకొని అనుభవజ్ఞులయొక్క సలహాలను పొందిస్తామని ఒక హామీ ఇచ్చారు. G.O. pass చేశారు. కాని ఇంతవరకు ఆ Board ను constitute చేయలేదు. ఆ Board ను వెంటనే constitute చేసి తగిన విధంగా వ్యవసాయదారుల సమస్యలను పరిశీలించుటకు అవకాశము కల్పిస్తారని ఆశిస్తున్నాను. Forest విషయంలో కృష్ణా, గుంటూరు జిల్లాలు కలిపి పూర్వమునుంచి ఒకే District Forest Officer క్రింద ఉంటున్నాయి. తరువాత [illegible] అడవులుకూడ Forest area లో కలపడంవల్ల, ఈ రెండు జిల్లాలుకూడ ఒక District Forest Officer ఆజమాయిషీలో ఉండడంవల్ల వారికి ఎక్కువ పని కలుగుతున్నది. 1908 వ సం॥లో District Forest Officer కు సిబ్బంది నియమించారు. పెరిగి అడవులను ఆజమాయిషీ చేయవలసి వచ్చినప్పుడుకూడ సిబ్బందిని పెంచలేదు. Forest Officers తొందరగా పని చేయలేక పోతున్నారు. ఇంకా ఇద్దరినో, ముగ్గురినో గుమాస్తాలను ఎక్కువచేయాలి. లేదా కృష్ణా జిల్లాకు ఒక Officer ను, గుంటూరు జిల్లాకు వేరే ఒక Forest Officer ను నియమించాలి. అట్లు చేసినట్లయితే ప్రభుత్వమునకు సమాచారము తెలుస్తాయి, వారి సమస్యలను తొందరగా పరిష్కరించుటకు అవకాశం యేర్పడుతుంది.

గ్రామాలలో ఉన్న చెరువులలోని చేపలు పట్టుకొనే అధికారం Fisheries Co-operative Societies కు ఇవ్వాలని చెబుతున్నారు. దీనివలన గ్రామ పంచాయతీలకు, ఈ సొసైటీలకు చాలా తగాదాలు వస్తున్నాయి. ఈ సొసైటీలుకూడా ఉంటే మాకు అభ్యంతరంలేదు. పల్లెలలోనివారికి జీవనోపాధి కల్పించుటకు అవకాశాలుంటాయి. పల్లెలలోగాని పట్టణాలలోగాని అక్కడ ఉంటే జలాధారములలోని చేపలను వారు పట్టుకొని అమ్ముకొనే హక్కు ఇచ్చినట్లయితే మాకు అభ్యంతరంలేదు. ఒక గ్రామంలో ఉన్నటువంటి చెరువులలోనిచేపల మీద ఎక్కడో సొసైటీలోనివారికి హక్కు ఇచ్చినట్లయితే గ్రామాలలోని ప్రజలు చాలా బాధపడుతున్నారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పంచాయతీలు ఎక్కువ బాధ్యతలను నిర్వహింపవలసియున్నది. పంచాయతీలకు వచ్చే ఆదాయం ఏమాత్రమూ పెంచలేదు. సొసైటీలు లేనటువంటి గ్రామాలకు చేపలుపట్టుకొనే హక్కు పంచాయతీలకు ఇచ్చినట్లయితే పంచాయతీల ఆదాయం పెరుగుతుంది. పంచాయతీల మీద ఉంచిన బాధ్యతలు సక్రమంగా నెరవేరుటకు అవకాశం ఉంటుంది. ఈ చేపల వల్ల వచ్చే ఆదాయమును పంచాయతీలకు, సొసైటీలకు ఇస్తామంటున్నారు. కాని పాటపెట్టే అధికారంమాత్రం రెవిన్యూ అధికారులకు ఇస్తామంటున్నారు. పంచాయతీ గ్రామాలలోని చేపలవల్ల వచ్చే ఆదాయమంతాకూడా పంచాయతీలకే సద్వినియోగం చేసుకోవాలని పంచాయతీ act లో ఉన్నది. కాని చేపలుపట్టే హక్కు రెవిన్యూ అధికారులకు ఇచ్చారు. ఏయే జిల్లాలలో ఏయే చెరువులలో చేపలుపట్టుకొనుటకు అవకాశముందో ఆ information అంతా తెప్పించి కలెక్టరుగారికి apply చేసుకుంటే lease కు ఇవ్వడం అనేసమస్య పరిష్కారమై orders వచ్చేటప్పటికి April, May నెలలుకూడ దాటిపోతున్నాయి. Orders వచ్చేటప్పటికి చెరువులలో చేపలు ఉండకపోవడం జరుగుతున్నది. అందుచేత ఈ అధికారం పంచాయితీలకు ఇచ్చినట్లయితే జూన్, జూలై నెలలో చేపలుపట్టి, వేలంపాట వేసుకొనుటకు అవకాశం ఉంటుంది. దీనివలన ఆదాయంకూడ పెరుగుతుంది. ఈ అవకాశం ఇచ్చినందులకు అధ్యక్షులవారికి నా అభినందన లర్పిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI G. RAMU NAIDU:—అధ్యక్షా, ఈ అడవులవిషయంలో ప్రజలకు చాలా అన్యాయం కలుగుతున్నది. కొన్నికొన్ని చోట్ల 1 ఫర్లాంగు, ½ ఫర్లాంగుకుకూడ forest boundry పెడుతున్నారు. దీనివలన ప్రజలు చాల ఇబ్బందిపడుతున్నారు. కొండజాతి ప్రజలకు సరియైన భూమి లేదనే సంగతి ప్రభుత్వమునకు తెలుసు. అక్కడి భూమి అంతా డొంకలతో నిండివుంటుంది. అటువంటివన్నీ రిజర్వు అడవులక్రింద తీసికొంటే ప్రజలకు భూమిలేక అవస్థపడుతున్నారు. మా ప్రాంతంలో

కాశిపడినమురా, బూసపాడు అనే గ్రామం ఒకటి ఉన్నది. అక్కడ భీముడనేవానికి 5 గురు కొడుకులున్నారు. మొత్తం 20 మందివరకు ఆ కుటుంబంలో ఉన్నారు. వారు ఏదో కొద్దిభూమిని సేద్యంచేసుకొంటున్నారు. Forest Department వారు వారిని ఆ భూమినుండి తొలగించివేసినారు. ఈ విధంగా ప్రజలు అనేక ఇబ్బందులకు గురిఅవుతున్నారు. ధనికొండ అనే ఊరిలోకూడ 1 ఫర్లాంగు, 2, 3 ఫర్లాంగులకు forest reserve boundary పెట్టినారు. అందువలన ప్రజలు చాలా ఇబ్బందిపడుతున్నారు. అటువంటి భూములను రిజర్వుచేయించకుండా ప్రభుత్వంవారు మమ్ములను రక్షించాలి. ఆ భూమి మాకు లేకపోయినట్లయితే మేము చాలా బాధ పడిపోతాము. పులుసుమామిడి, ధనికోట మున్నగు గ్రామములలో రిజర్వు బౌండరీలు వేసి ప్రజలకు భూమిలేకుండా చేస్తున్నారు. రైతులు చాలా ఇబ్బందిపడుతున్నారు. కొండజాతిప్రజలకు ఏమీ సహాయంచేయుటలేదు. ప్రజలకు ఇటువంటి అన్యాయములు చేయడం ప్రభుత్వమునకు ధర్మముకాదు కొండజాతి ప్రజలకు భూములు ఇవ్వాలి. ఉపయోగంలేని భూములను ప్రభుత్వంవారు రిజర్వుచేసుకోవచ్చును. ఈ forest boundaries ను శంకరమెట్ట, పెద్దలబడ్డు, చిన్నలబడ్డు మొదలగు గ్రామాలకు ఏర్పాటు చేసినారు. అవి చాలా దగ్గరదగ్గరగా ఉన్నాయి. అటువంటివన్నీ కూడ రిజర్వుచేయుటవలన ప్రజలు చాలా బాధపడుతున్నారు. ప్రజలకు కొంతభూమి ఇచ్చి మిగిలినది రిజర్వుచేసుకొనవచ్చును. అంతేకాని రైతులకు భూమి లేకుండాచేయుడం ప్రభుత్వంయొక్క ధర్మంకాదు. ప్రజలు బ్రతుకుటకు కావలసిన ఆహారపదార్థములు పండించుకొనుటకు భూమి ఉండాలి. అటువంటిభూమి రైతులకు కలుగజేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI A. BAPINEEDU :—అధ్యక్షా, సేంద్రియపు ఎరువుల క్రయ విక్రయాలకు వ్యక్తుల చేతులనుంచి తొలగించి Co-operative societies కు ఇచ్చినందుకు ప్రభుత్వాన్ని అభినందించవలసిఉన్నది. క్రిందటి సంవత్సరము ఎరువుల పంపిణీలో జరిగినటువంటి అన్యాయం Black market అందరికి తెలిసిన విషయమే. Co-operative societies సక్రమంగా పనిచేస్తాయని మనం ఆశించవలసిఉన్నది. మొత్తం జనాభాలో 80% వ్యవసాయదారులు ఉన్నారు. ప్రస్తుతం మన ప్రధానమంత్రిగారు ఆ portfolio కు వేరే మంత్రిగారిని వేసినందుకు వారిని అభినందించవలసిఉన్నది. కాలం మారిపోతోంది. విశాలాంధ్ర వస్తున్నది. ఆరు మాసాలలో మనం హైదరాబాద్ వెళ్లబోతున్నాము. అప్పుడు Agriculture Department ను improve చేసినట్లయితే బాగుంటుంది. ప్రస్తుతం మన ఆంధ్ర రాష్ట్రంలో డెల్టా areas లో చాల improvement జరుగుతున్నది. కాని

మొత్తంమీద agriculture విషయంలో చాల విలంబనం జరుగుతోందని చెప్పడానికి సందేహంలేదు. Agriculture Demonstrators నిజమైన agriculturists కాకపోవడంవల్ల కేవలం ఉద్యోగంకొరకు Demonstrator లుగా వచ్చి జీతంకొరకు పనిచేస్తున్నారు. కాబట్టి విలంబన జరుగుతున్నది. Tractor లు, bull dozer లు supply చేసినప్పటికి వాటిని వారు సరిగా చూడక అవి ఎక్కుడైన చెడిపోయినట్లయితే నెలలాదిగా అక్కడేపడేసి, Tractor లను repair చేయకుండా, బాధ్యతలేకుండా వ్యవహరిస్తున్నారు. Tractor లు, Bull dozers Pumpsets విషయంలోకూడా బాగా జరగడంలేదని చెప్పడానికి సందేహంలేదు. Pump sets విషయంలో కొన్ని అక్రమాలు జరిగినాయి ఆ విషయంలో allotment చేయడంలో సరైన distribution జరగడంలేదని మనవిచేస్తున్నాను. వర్జీనియా పొగాకువల్ల ప్రభుత్వానికి, రైతులకుకూడా బాగా ఆదాయంవస్తున్నది. కాని I. L. T. D. Company అనేటటువంటి ఒక కంపెనీ రూపాయిసరుకును 4 అణాలకు, 2 అణాలకు కొనుక్కుంటుంది. ముఖ్యంగా ఈ సంవత్సరం రైతులను మట్టిచేసి రూపాయిసరుకు 4 అణాలకు 2 అణాలకు కొన్నదని చెప్పడానికి ఏమి సందేహంలేదని మనవి చేస్తున్నాను. ఆ విషయములో ఒక Revenue Board member ను appoint చేసి 9 లక్షలకుపైగా ఒక scheme ను తయారుచేసి Pai's report అనే పేరుతో Central government కి ఒక report ను submit చేశారు. అది వెంటనే అమలుజరపకపోయినట్లయితే రైతులకు కొన్ని కోట్ల రూపాయలు నష్టము రావడానికి సందేహంలేదు. అందువలన ముఖ్యంగా Agriculture Department వారు, Agriculture Minister గారు ప్రయత్నించి I. L. T. D. Company ని nationalise చేస్తేతప్ప రైతులు బాగుపడేందుకు అవకాశంలేదు. ఎందువల్లనంటే వర్జీనియా పొగాకు నిలవఉంచడానికి వీలులేదు. రైతులు పొగాకు cure అయిన 10 రోజులలోగా అమ్ముకోవాలి. ఎందుచేతనంటే Redrawing plant లు లేవు. Cold storages లేవు. కనుక Pai గారి Report అమలుజరిపి మనం cold storage గాని, redrying plant గాని పెట్టుకొన్నట్లయితే మన ఇష్టంవచ్చినన్నాళ్లు ఉంచుకొని ఇతరదేశాలకు కూడా Export చేయవచ్చు. అయితే I. L. T. D కంపెనీ వాళ్లు మన దగ్గర కొని 14 అణాకు కొని ఇతరదేశాలలో 4 లేక 5 రూపాయలకు అమ్ముతున్నారు. అన్నిటికంటా అక్రమంగా, ఇతర మార్కెట్టులో private owners అందరిని అదుపులో ఉంచుకొని రూపాయిసరుకును 2 అణాలకు, 8 అణాలకు కొనుక్కోవడంవల్ల రైతులకు కొన్నికోట్లరూపాయలు నష్టము వచ్చిందనడానికి సందేహం

28th March 1956] [Sri A. Bapineedu

లేదు. అందుచేత ఈ కంపెనీని మన దేశంనుంచి వెళ్లగొట్టవలసిందిగా నేను మనవి చేస్తునాను

Forest ల విషయంలోకూడా private రైతులకు permit కావాలనే bad system పూర్వంనుంచి వస్తున్నది. తన private land లో చెట్టు కొట్టుకొన్నప్పటికికూడా permit కావలసిఉన్నది. ఆ permit system ను రద్దుచేయించవలసిందిగా మనవిచేస్తున్నాను. పంచాయితీబోర్డు చెరువులలోఉండే చేపలను కూడా society లకు ఇస్తున్నారు. ఇది చాల అన్యాయం పూర్వం ఒక రకంగా ఉండేది. తాడిచెట్టు వేసుకొంటే పైభాగం జమీందారుకు మొదలు రైతుకుఉండేది. అందుచేత తాడిచెట్లు ఎప్పుడు పెంచేవాడుకాదు ఆ విధంగానే పంచాయతీబోర్డు చెరువులను society లకు ఇవ్వడంవలన వీళ్లు చేపలు పెంచరు. వాళ్లకు చేపలుఉండవు అందుచేత Fisheries societies ఉన్నప్పటికి మేము పాడుకొనే హక్కు పంచాయతీవారికి ఇస్తేనే బాగుంటుంది. ఎందుచేతనంటే చేపలపల్లెకారులే పట్టుకొంటారు, గాని సొసైటీవాళ్లు పట్టుకోరు. అందుచేత At least పంచాయితీలోని మంచినీళ్ల చెరువులను ఈ societies కు ఇవ్వడంవలన గ్రామాలలో తగాదాలువచ్చి బుర్రలు పగలకొట్టుకునేస్థితికూడా వస్తున్నది. అందువలన పంచాయతీలోని మంచినీళ్ల చెరువులను మినహాయించి మిగతా చెరువులను ఇచ్చే ఏర్పాటు చేయవలసిందనీ కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri D. VENKATARAMANAPPA :—అధ్యక్షా, ఈ నాడు వ్యవసాయ శాఖామంత్రిగారు ప్రవేశపెట్టినటువంటి ఈ 3 డిమాండులను నేను బల పరుస్తున్నాను. Agriculture veterinary forests ఈ మూడు పద్దులుకూడ ఒకదానికొకటి సన్నిహితసంబంధం ఉండడం, ఈ మూడింటిని ఒక్క మంత్రిగారే, రైతు కుటుంబానికి చెందినవారే ప్రవేశపెట్టడం మిక్కిలి సంతోషకరమైన విషయం. వ్యవసాయం విషయం తీసుకొంటే ఈ కొద్ది సంవత్సరాలలోను మన దేశం వ్యవసాయకంగా ఎంతో అభివృద్ధిచెందినది. అందుకు ప్రభుత్వాన్ని అభినందించక తప్పదు. అందులో ముఖ్యంగా వాణిజ్యపంటలు కొన్ని సమయాలలో పంటపండినప్పుడు ధరలు లేకపోవడం, ధరలు ఉన్నప్పుడు పంట సంతృప్తికరంగా లేకపోవడం తటస్థపడుతూ ఉంది. ఈ సంవత్సరం వాణిజ్యపంటలలో [illegible] పంటలు [illegible] రాయలసీమలో ఇది చాల దెబ్బతిన్నది. ప్రారంభంలో పంట పండినప్పుడు ధరలులేకుండాఉండి తరువాత క్రమేపివృద్ధి [illegible] వచ్చినా రైతులు వాటిని నిల్వచేసుకొనే శక్తిలేక తక్కువ ధరకే అమ్ము

ఎక్కువ నష్టముపొందుతున్నారు. కాబట్టి ప్రభుత్వంవారు వాణిజ్యపంటల ధరలను స్థిరీకరణచేయుటకు ప్రోత్సాహము చేయవలెనని మనవిచేస్తున్నాను.

ఇక veterinary శాఖ విషయంలో భారతదేశం వ్యవసాయదేశమని వ్యవసాయదారులందరు పశువులపై ఆధారపడి ఉన్నారనేది మన కందరకు తెలిసిన విషయమే. ఈ పశువులకుకూడా ప్రజలకువలెనే అనేక రోగాలు సంప్రాప్తమాతున్నాయి. అయితే మన దేశంలో మాత్రం, veterinary శాఖలో వైద్య సహాయం తృప్తికరంగాలేదని చెప్పడానికి విచారిస్తున్నాను. అందుకొరకు ప్రభుత్వమువారు తగిన శ్రద్ధవహించి అనేకచోట్ల veterinary ఆస్పత్రులను ఏర్పాటుచేసి తగిన చికిత్సచేసేట్లు ఏర్పాటుచేస్తారని నేను వాంఛిస్తున్నాను. కాని పశుపోషణకు ముఖ్యంగా పచ్చికబయళ్లు ఉండవలెను. అడవిప్రాంతాలలోతప్ప తక్కిన మెట్టప్రాంతాలలో ముఖ్యంగా రాయలసీమ, అనంతపురం జిల్లాలో పశువులు మేపుటకు చాల ఇబ్బందిగా ఉన్నది. అందువలన ప్రతిగ్రామంలోను కనీసం 100 ఎకరాలైన grazing fields క్రింద ఏర్పాటుచేసి పుష్కలంగా పచ్చిగడ్డి దొరకునట్లు ఏర్పాటుచేయవలసిందిగా కోరుతున్నాను.

మనదేశ శ్రేయస్సు కోసం అడవి సంపదకూడ ఎక్కువ ప్రాముఖ్యమైనది. అందువల్ల ఈ విషయంలో ప్రభుత్వంవారు ఎంతో శ్రద్ధ వహించవలసియున్నది. అనేక చోట్ల పాడుపడినటువంటి ఈ అరణ్యములలో చెట్లుపెంచి వీటిని వృద్ధిపరచవలసియున్నది. వర్షాపాతమునకు కూడ ఈ అడవులే ముఖ్య ఆధారము గనుక సాధ్యమైనంతవరకు ఈ అడవులనుకూడ పెంపకం చేయవలెనని ప్రార్థిస్తున్నాను.

SRI D. KONDAIAH CHOWDARY :—అధ్యక్షా, ఈ వ్యవసాయ డిపార్టుమెంటువారు రైతులకు ఇచ్చేటటువంటి ఈ pump sets గురించి ఒక విషయం మనవిచేయదలచాను. ఈ pump sets అప్పు ఇచ్చేటప్పుడు కొన్ని పరిమితమైనటువంటి trade marks గల pump sets నే కొనవలసిందని agriculture department వారు insist చేస్తున్నారు. ఇది కేవలము నాసిరకమైనటువంటి సరుకు. వాటిని తీసుకువచ్చిన తరువాత కొన్ని రోజులలోనే అవి చెడిపోతున్నాయి. రైతులకు దాని machanism తెలియదు కాబట్టి చాలా బాధపడుతున్నారు. అందువల్ల రైతులకు pump sets కొరకు డబ్బు అప్పుగా ఇచ్చేటప్పుడు, ఫలానా రకం pump sets మాత్రమే కొనవలసిందని ఆ విషయంలో [illegible] చేయకుండా కేవలం వాళ్ల ఇష్టానికి వదలిపెట్టి మార్కెట్‌లో

మంచిదేదైనా తెచ్చుకొనేదానికి అవకాశము కలుగజేయవలెను. అట్లు లేకపోతే అవి తీసుకునిపోయిన ఒక మాసము, 2 మాసములకే చెడిపోతున్నాయి. దానివల్ల వారు చాలా బాధపడడమే కాకుండా, ఏదైనా అభివృద్ధి సాధించాలంటే ఒక రకమైన నిరుత్సాహము కలగడానికి అవకాశమున్నది. కాబట్టి, ఈ pump sets కొనుక్కునే విషయంలో, market లో ఉన్నటువంటి మేలురకపు పంపులు కొనుక్కోడానికి రైతుకు permission ఇవ్వవలెనని నేను మంత్రిగారిని కోరుతున్నాను.

ముఖ్య మంత్రిగారు ఇదివరకు Forest Department ను నిర్వహించేటప్పుడు, పలువిధములైన శాసన సభ్యులను ఈ అడవుల విషయముగురించి ఆలోచించుటకు సమావేశపరచారు. అప్పుడు మేము కొన్ని సూచనలు చేశాము. కాని ఒక సూచనకూడ అమలులో పెట్టినట్లు ఎక్కడా కన్పించడంలేదు. మొన్న ఈ విషయం గురించి ముఖ్యమంత్రిగారిని ప్రశ్నించినప్పుడు కొత్త మంత్రిగారు పదవి స్వీకారము చేశారు, వారు ఒక కొత్త committee వేస్తారు. లేకపోతే తిరిగి ఒక సమావేశం జరిపి విచారణ జరుపుతారనే విధంగా సమాధానం చెప్పారు. ముఖ్యంగా జమీందారీ ప్రాంతాలలో ఉండే రైతులు ఆ ప్రాంతాలను ప్రభుత్వము స్వాధీనం చేసుకొన్న తరువాత ఉన్న పరిస్థితులు చూచి, ఈ ప్రభుత్వంకన్నా; జమీందారులు ఉంటేనే మేలు అనేభావము వారికి కలిగేటటువంటి పరిస్థితులు ఇప్పుడు ఏర్పడినాయంటె, అందుకు ఈ Forest ఉద్యోగస్థులు పెడుతున్న విపరీతమైన షరతులే కారణమని చెప్పకతప్పదు ముఖ్యంగా అడవులలో ఉండే గ్రామాలు అంటే చుట్టూ అడవి ఉండి, మధ్యలో గ్రామముండేటటువంటి గ్రామాలలో, ఆ గ్రామానికి ఆనుకొని చుట్టూ reserve forest పెట్టడంబట్టి రైతులయొక్క పశువులు బయటికి పోతే, వాటిని తీసుకుపోయి, బందిలి దొడ్డికి తోలడంవల్లను, వారిమీద ఎక్కువ pounds విధించడంవల్లను, రైతులలో విపరీతమైన బాధ, ఆందోళన కలుగుతున్నవి. ఈ విషయము మేము అనేకసార్లు ముఖ్యమంత్రిగారికి చెప్పుకొన్నాకూడ, ఇంతవరకు దరిదాపు లేకుండా ఉండే పరిస్థితి ఏర్పడింది. ఈ reserve forests వచ్చిన తరువాత ప్రతినిత్యము, ఆ forest watcher గాని, లేక Guard గాని, వారి దయాదాక్షిణ్యాలపైన రైతులు ఆధారపడవలసిన దుస్థితి ఏర్పడిందని చెప్పడానికి మాత్రము ఏమి సంకోచించడంలేదు. ఈ విషయంలో త్వరలోనే forest conservator తో విచారించి, ప్రతి గ్రామం చుట్టు కొంత బయలుగా వదలపెట్టి పశువులు విడిగా తిరగడానికి అవకాశము కలుగజేస్తారని అప్పుడు మంత్రిగారు హామీ ఇచ్చారు. కాని ఇదివరకు ఆ హామీ ఏ మాత్రము అమలు

పెట్టబడలేదు. అడవులలో ఉండేటటువంటి ముఖ్యమైన గ్రామాలకు చుట్టు అడవులు ఉండటం మూలానబయటికి పోవడానికి వీలులేకుండా ఉన్నది. కాబట్టి, ఈ forest reserve ను నిర్ణయించేటప్పుడు చుట్టు ప్రక్కల ఒక అరమైలు ప్రదేశము వదలి పెట్టి ఆ తరువాత ప్రదేశము వాళ్లు reserve చేసుకొంటె చాలా న్యాయంగా ఉంటుంది. లేకపోతే ప్రతినిత్యము ఈ forest వాళ్ళ బెదరింపులకు గురిఅయి లంచాలు ఇచ్చుకోవలసి యుంటుందని, పశువులను మేపుకోలేకుండా ఉన్నామని అక్కడ ప్రజలు చాలా ఆందోళన చేస్తున్నారు. ఒక్క పశువు బయటికిపోతే 7, 8 రూపాయలు compound ఇచ్చుకోవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది. అందు వల్లనే ఈ విషయం నేను మరల చెప్పడం జరుగుచున్నది. ఇప్పటికైనా ఈ కొత్త మంత్రిగారైనా శ్రద్ధవహించి కొంతమంది శాసన సభ్యులను, ముఖ్యంగా అడవి ప్రాంతాలలో ఉండే శాసన సభ్యులతో ఒక సమావేశము ఏర్పాటుచేసి ఈ పరిస్థితు లన్నీ జాగ్రత్తగా పరిశీలించవలసిందనిన్నీ, తరువాత ఈ Forest Department లో జరుగుతున్న అవకతవకలన్నీ విచారించడానికిగాను, forest laws అన్నీ పరిశీలించ డానికిగాను కొంతమంది శాసనసభ్యులతోను, నిపుణులతోను కూడినటువంటి ఒక కమిటీని వేసి, 11 జిల్లాలలోను ఉన్నటువంటి పరిస్థితులు గమనించి, ఆ కమిటీచేసిన సూచనల ప్రకారం నూతనమైన forest laws తయారు చేస్తారని నమ్ముతూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI A. CHITAMBARA REDDI:—అధ్యక్షా, యీనాడు వ్యవసాయ శాఖామాత్యులు ప్రవేశపెట్టినటువంటి యీ పద్దును నేను బలపరుస్తున్నాను. వ్యవ సాయముమీద ఎన్నో సూచనలు ఇవ్వవచ్చును కాని ఒక్క విషయముమాత్రము మంత్రిగారిదృష్టికి తెస్తున్నాను. ఈనాడు రాయలసీమలో రైతు వేరుశనగ పంట విషయంలో ఎంత ఇబ్బందిపడుతున్నాడో మంత్రిగారిదృష్టికి తెస్తున్నాను. మన హిందూదేశములో వేరుశనగపంట ఒక్క ఆంధ్రరాష్ట్రములోనె 18.6 పండు తున్నది. అందులో కడప, కర్నూలు, అనంతపురము, చిత్తూరు, యీ జిల్లాలు మాత్రమే 15.8 పండిస్తున్నాయి. కాని యీ రైతుకు ప్రతి సంవత్సరము దెబ్బ తగులుతున్నది. నవంబరు, డిసెంబరు, నెలలో పంట చేతికి తీసుకొంటున్నాను. ఆ సమయానికి కేంద్రప్రభుత్వమువారు export policy declare చేయడంలేదు. కాని జూన్, జూలైమాసాలలో export policy declare చేస్తున్నది. అందు వల్ల పంట పండినప్పుడు సరియైనధరలు రాకపోవడంవల్లను, ఆ సమయానికే, ప్రజల వద్దనుంచి తెచ్చినటువంటి అప్పులు, ప్రభుత్వానికి చెల్లించుకోవలసిన అప్పులు, land revenue అంతా ఇవ్వవలసివస్తుంది గనుకను, చిన్నచిన్న రైతులు తమవద్దగ

ఉన్నటువంటి కాయ అంతా మొత్తం మధ్యతరగతివాళ్లకే అమ్ముకొంటున్నారు. తరువాత అది వాళ్లదగ్గరనుంచి millers దగ్గరకు పోతున్నది. Millers కు పోయినతరువాత, కేంద్రప్రభుత్వంవారు export policy declare చేయడం జరుగుతుంది. ఆ విధంగా వాళ్లకు అధికలాభాలు రావడం జరుగుతుంది. మొన్నటికి పోయిన సంవత్సరం మేనెలలో కేంద్రప్రభుత్వము export ఇవ్వడంలేదని declare చేసింది. అప్పుడు రైతులు ఎట్లాగూ కేంద్ర ప్రభుత్వము export ఇవ్వడంలేదని, కనుక సరుకు అమ్ముకోకపోతే సాధ్యంలేదని అమ్ముకోవడం జరిగింది. అదంతా millers దగ్గరకు పోయినతరువాత, జూన్ రెండవవారములో export policy declare చేయడం జరిగింది. దానివల్ల millers కు అధికలాభాలు రావడానికి అవకాశం ఏర్పడింది. కాని ఈసంవత్సరం పరిస్థితి కొంతమెరుగ్గా ఉన్నది. ఫిబ్రవరి ఆఖరువరకు Foreign export అట్లాగే ఉంచారు, గనుక మాకు ఈధరలు రావడానికి అవకాశము ఏర్పడింది. గడచిన ప్రభుత్వములో మంత్రిగా ఉన్నటువంటి తిమ్మారెడ్డిగారు దీనికి ఎక్కువ కృషిచేశారు. ఈప్రభుత్వములోకూడ రైతుల యొక్క కష్టసుఖాలు తెలిసినటువంటి ఓబులరెడ్డిగారు యీ శాఖను నిర్వహిస్తున్నారు. ఈ విషయములో వారు ఎక్కువ కృషి చేస్తేతప్ప రాయలసీమ రైతు అభివృద్ధి అవడానికి వీలులేదని వారికి మనవిచేస్తున్నాను.

రెండవది seed farms విషయములో, మాకు ఎక్కడో, మారటేరు, బుచ్చిరెడ్డిపాలెం, అనకాపల్లి ప్రాంతాలలో తయారుచేసినటువంటి seeds పంపిస్తున్నారు. పోయిన సంవత్సరం మారటేరునుంచి నాకేదో విత్తనము,మంచిదనిచెప్పిసప్లయిచేశారు. దానితో 170 రోజులకు పంటవస్తుందని చెప్పారు. కాని నేను విత్తనంచల్లి పంట తీసేటప్పటికి 165 రోజులైంది. ఒకమూట విత్తనంపోస్తే ఒక ఎకరాకుకూడ నాకు విత్తనంరాలేదు. నా సేద్యంలో తప్పిదైనా ఉందేమో అనుకొన్నాను. తరువాత చూచేటప్పటికి వారు పొక్కిపోయిన విత్తనం ఇచ్చినట్లు తెలిసింది. కనుక, ప్రతి జిల్లాకు ఒక seed farm ఉంటేనేతప్ప మీరు ఎంత కృషిచేసినాకూడ వ్యవసాయాభివృద్ధికాదు, అని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. Seeds అతి త్వరగా దొరికేటట్లుచూస్తే తప్ప మార్గంలేదు.

మూడవది, రైతుబిడ్డలు చదువుకొన్నవాళ్లు సేద్యానికి నిరుపయోగమవుతున్నారు. చదువుకొన్న ప్రతి ఒక్కరు ఉద్యోగాలు కోరాలంటున్నారు. వ్యవసాయము చేసుకోవాలనే అభిప్రాయము మాకు ఉన్నప్పటికీకూడ మాకు అవి అందుబాటులోలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఒక్క బాపట్లలో

Sri A. Chidambara Reddi] [28th March 1956

Agricultural college పెట్టి అక్కడ ఆరునెలలు short course అని agriculture లో training ఇస్తేసమాత్రము చాలదని చెప్పుతున్నాను.

THE HON. DR. B. GOPALA REDDI :—దానికికూడ ఎవరు రావడం లేదంటున్నాను.

SRI A CHITAMBARA REDDI.—మాకు అది అందుబాటులో లేదు. దూరముగా ఉన్నది. గనుక, అక్కడికి పోలేకుండా ఉన్నామని మనవిచేస్తున్నాను. కాని ప్రతి జిల్లాలో ఆలాంటి agricultural training school పెట్టితే, తప్పక వస్తారని మనవిచేస్తున్నాను

ఈ మూడువిషయాలు మంత్రివర్గము ఆలోచిస్తుందని ఆశిస్తూ సెలవు తీసుకొంటున్నాను.

SRI E. NAGAYYA :—అధ్యక్షా, రైతు కుటుంబములో పుట్టి, యిప్పటికి దాదాపు 25 సంవత్సరాలుగా రైతులోకములో కష్టించి పని చేసిన తరువాత, ఓబులగారిని యిక్కడ మంత్రిగా appoint చేసినందులకు ముఖ్య మంత్రిగారికి నా కృతజ్ఞత తెలుపుచున్నాను. మంత్రిగారు యీనాడు ప్రవేశపెట్టిన డిమాండును నేను బలపరుస్తూ, కొన్ని సూచనలు చేయదలచుకున్నాను

వ్యవసాయానికి సంబంధించిన ఒక కాలేజీ గుంటూరు జిల్లాలోని బాపట్లలో ఏర్పాటుచేయబడి నడిపించబడుతున్నది. ఈ కాలేజి మా విశాఖపట్టణము, శ్రీకాకుళము జిల్లాలకు ఎంతో దూరముగా ఉన్నది. అందుచేత ఎవరో భాగ్యవంతుల పిల్లలు తప్ప, సామాన్య పేద కుటుంబాలవారు తమ పిల్లలను యింతదూరము పంపించి వ్యవసాయమునకు సంబంధించిన విద్యను నేర్పించుకోడానికి అవకాశము లేకుండా పోతున్నది. విశాఖపట్టణము జిల్లాలో ఉన్న అనకాపల్లివద్ద ఒక Agriculture Farm ఒకటి ఉన్నది. అందులో చాలా భవనాలు ఖాళీగాకూడ ఉన్నవి. మా జిల్లాలకు అందుబాటులోగూడ ఒక కాలేజీని ఏర్పాటు చేస్తే ఆ జిల్లాలలో ఉండే పేద విద్యార్థులకుగూడ అందుబాటులో ఉంటుంది. పేద విద్యార్థులు చదువటానికి అవకాశములు ఏర్పడుతవి. ప్రస్తుతము మా జిల్లాల నుంచి బాపట్లకు వచ్చి చదువుకునే వారందరు చాలామటుకు లాయర్ల పిల్లలు, యింకా యితర భాగ్యవంతుల పిల్లలేకాని, పేద వాళ్ల పిల్లలుకారు. పైగా వారు ప్యాసుఅయి వచ్చిన తరువాత, వారు Agriculture Demonstrators గా పనిచేయటానికి వస్తే, వాళ్లు పేద కుటుంబాల రైతులతో మాట్లాడటానికి నామోషీగా feel అవుతూ ఉంటారు. పల్లెటూరి ప్రజలతో మాట్లాడి, వారికి కావలసిన వ్యవసాయపు సదుపాయాలను

28th March 1956] [Sri E. Nagayya

బోధించటానికి సామాన్య కుటుంబాల పిల్లలే ఎక్కువగా ఉపయోగిస్తారు. కాబట్టి మాకు అనకాపల్లిలో ఒక Agriculture College ను త్వరలో ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత వ్యవసాయానికి అవసరమైన వ్యవసాయపు పనిముట్లు విరివిగా రైతులకు సప్లయి చేయవలసిన అవసరము ఎంతయినా ఉన్నది. తరువాత Manures వగైరాలుకూడ Co-operative Department ద్వారా కాకుండా ఏదో ప్రైవేటు వ్యక్తుల ద్వారా సప్లయి చేయబడుతున్నందులకు రైతులకు అవి సమయానుకూలముగా సకాలములో సప్లయి కావడము లేదు. దీనివల్ల రైతులు, ముఖ్యముగా పేదరైతులు ఎన్నో ఇబ్బందులకు గురిఅవుతున్నారు. Black market జరుగుతున్నప్పటికిని, ధనవంతులు, భూస్వాములు ఎంతడబ్బు అయినా ఖర్చుచేసికొనుక్కొనగల సామర్థ్యము ఉంటుంది, పేదరైతులు ఆ విధముగా కొనుక్కోలేరు. కాబట్టి రైతులకు అందుబాటులో సప్లయి అయ్యేటట్లుగా ఏర్పాటుచేయాలని అంటున్నాను.

తరువాత Bull dozers ను ప్రభుత్వము సప్లయిచేస్తున్నారుకాని, ఇవి ఎక్కడోఒక చోటులో ఏర్పాటుచేశారు. వీటిని ఉపయోగిస్తే, గంటకు 12 రూపాయిలు చొప్పున అద్దె యివ్వాలి. ఏదైనా ఒక పెద్ద plot ను దున్నాలని అంటే, దానికి సామాన్యముగా నాలుగువందలదాకా అద్దె రూపములో యివ్వాలి. ఇదిగాక అవి మారుప్రాంతములలో ఉన్నవి. అవి జిల్లాలలో ఉన్న మారుమూల గ్రామాలకు పోవాలంటే దానికి దారి పొడుగున పెట్రోలు ఖర్చు ఉన్నది. దీనికి T. A కావాలని అంటారు. ఉదాహరణకు నరసీపట్టణములో ఈ bull dozers ఉంటే, అక్కడినుంచి నలభై, యాభైమైళ్ళదూరము రావాలంటే, T. A. క్రింద నాలుగువందలదాకా చార్జీచేస్తారు. ఈ ఖర్చు ఆ ఖర్చు అంతాచేరి దాదాపు 800 యివ్వవలసి ఉంటే, యీ ఖర్చుఅంతా రైతు ఏ విధముగా భరించగలడు ? ఏదైనా దగ్గర ప్రదేశములలో ఏర్పాటుచేస్తే, చార్జీలు ఎక్కువగా భరించవలసిన అవసరము ఉండదు. అందువల్ల యీ Bull dozers ను అందుబాటుగా ఉండే ప్రదేశములలో ఏర్పాటుచేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత మా శ్రీకాకుళం జిల్లాలో చీపురుపల్లి ఏరియాలో సుమారు ఆరు, ఏడువేలమంది జనులు చేపలు పట్టుకొని అమ్ముకుని జీవిస్తున్నారు. వారు దూర ప్రాంతాలకు తీసుకొనిపోయి అమ్ముకోవలసిన పరిస్థితులు ఉన్నవి. వారికి marketing facilities బొత్తిగా లేవు. ఇవి store చేయటానికికూడ అవకాశములు ప్రభుత్వము కలిగించలేదు. ఇప్పటివరకు వారు మారుప్రాంతాలకు

